

విజ్ఞానవల్లరి ౨.






# మనబిడ్డలు

బుర్రా వెంకటనాంచారయ్య

ప్రకటనకర్తలు:
నమ్మాళ్వార్స
పోష్టు బాక్సు ౨౫౧
మద్రాసు

సర్వస్వామ్య సంకలితము — ౧౯౩౯ — వెల ఆరు అణాలు లేక ఒక షిల్లింగు

# మన బిడ్డలు





గ్రంథకర్త:

బుర్రా వేంకటనాంచారయ్య, ఎం;ఏ.



ప్రకటనకర్తలు:

## నమ్మాళ్వార్స్

౨౧, స్ట్రాటన్ ముత్యామొదలి వీధి,

పోస్టుబాక్సు నెం ౨౪౧, మద్రాసు.





౧౯౩౮

వెల ఆరు అణాలు, లేక ఒక షిల్లింగు.

# విషయసూచిక

# మన బిడ్డలు

## ౧

## గర్భోత్పత్తిక్రమము

మనజీవితము జీవాణువులపై నాధారపడియున్నదని మనకందఱికిని దెలిసినవిషయమే. అయినప్పటికి నట్టిజీవాణువులు పిండోత్పత్తికిపూర్వ మనిర్దిష్టమగు నవస్థయందుండుననియును, విచిత్రసంయోగము నొందినప్పుడే గర్భమగుచున్నదనియును మననమ్మిక. వాస్తవము విచారింపగా నట్లుకాక యీజీవాణువులుగూడ నిర్దిష్టమగు జీవనముగల్గియుండి యొకప్రత్యేకమగు నభివృద్ధిగాంచుచున్నవని తేలుచున్నది. జీవాణువు పితరులయంశము, దీనియభివృద్ధియే శిశువగును. ఈయభిప్రాయము నధునాతనులగు శాస్త్రజ్ఞులు కొంతవఱకు దిద్దియుండిరి. జీవాణువులు గర్భోత్పత్తిసమయమున తల్లిదండ్రుల బిడ్డఱినుండియు సంయోగమునుగాంచి పిండముగ నేర్పడుచున్నవనిరి. సూక్ష్మదర్శిని మొదలగు పరికరములు వృద్ధిగాంచి వస్తుస్వభావముల నిజస్థితిని దెలియు నుంకించు శాస్త్రజ్ఞులకెంతేని దోడ్పడు నీనాటికాలంబున నీజీవాణువులు పితరుల శరీరోత్పన్నములు కావనియు; తరతరములనుండియు వారివారి

పూర్వీకులవలని వంశపారంపర్యముగ దత్తములగుచున్న వనియు శాస్త్రజ్ఞులగు లైసుమన్‌గారు నూతనసిద్ధాంతముల బయలుదేరదీసిరి. దీపంబువలన మఱియొకదీప మెట్టు లుత్పన్నమగుచున్నదో యటులనే యీజీవాణువులు గూడ తరతరములనుండియు నొకవంశమునం దుద్భవించిన యొకరినుండి మఱియొకరిలోఁ బ్రవేశించుచున్నవి. లేక మఱియొక నూతనజీవిగఁ బరిణామము నందుచున్నవనుట సమంజసమేమో! అట్టిజీవియొక్క నాశికాద్యవయవములు గూడ నట్టిసూక్ష్మజీవులయందే యిమిడియున్నవట! దీనిని బట్టి యొకపిల్లవానిముక్కు తండ్రిముక్కును, మోము తల్లిమోమును పోలియున్నచో నాతని నాసికానిర్మాణమున కాతని తండ్రియందలి జీవాణువులెక్కువగఁ దోడ్పడినవనియును, మోము నేర్పాటుచేయుటకుఁ దల్లిజీవాణువు లెక్కువగ పాటుపడెననియును తేలుచున్నది.

తల్లితండ్రులలో నేరైన నంగవిహీనమైనచో వారికిగల్గు సంతానము తప్పక యంగవికలమై గల్గుచుండుటలేదేలనని చదువరులకు సందియము జనింపవచ్చును. తల్లిదండ్రులకు మధ్యలో నంగవైకల్య మేర్పడినచో నట్టి వారికి జనించెడు బిడ్డ లంగవికలులు గానేరరు. తల్లిదండ్రులు పుట్టుకతోడనే నంగవికలులైనప్పుడు సహితమొకప్పుడు దృఢగాత్రులైనబిడ్డలు జనించుట లేదా దీనికి కారణమేమో మీకు తెలియునా? వారిపూర్వీకుల గుణగణములు బిడ్డలకు సంక్రమించుచున్నవని యర్థము. ఇటులనే పితరులు స్వవృత్తినిర్వహణమునందు నేయంగము నెక్కువగ నుపయోగించుచున్నారో యట్టియంగము వారిసం

తానమునం దెక్కువ బలిష్ఠమై గానవచ్చును. జీబ్రాయను జంతువు మెడనుచాచి యాహారమును గ్రహించెడు స్వభావము గలదగుటచేతనే దానికంఠము పొడవైనదని పరిణామవాదుల మతము.

గ్రిగరీమెండల్ యనునాతఁడు పిండోత్పత్తికి పూర్వమీజీవాణువులున్న మఱికొన్ని యణువులును తల్లిదండ్రులిద్దఱి శరీరసంబంధములైనవి కలియుననియును, తిరిగి యవి విచ్ఛిన్నములై సంశ్లిష్టతఁజెందు సమయమున పితరులిద్దఱిలో నెవ్వరియణువు లెక్కువకలియునో వారిపోలికనే శిశువు జనించుచుండుననియును నుడువుచుండిరి. కనుక అట్టిదంపతులకు జనించెడు సంతానములో కొందఱుతండ్రిపోలికను మఱికొందఱు తల్లిపోలికను జనింతురు. మెండల్ గారు పూర్వికుల గుణగణములు గర్భస్థుఁడగు శిశువునకబ్బవచ్చు- నబ్బకపోవచ్చుననియు నొకవేళ యబ్బినను నేరుగా నబ్బకయే నట్టిశిశువు తల్లిదండ్రులలో నేరికేని యబ్బి వారినట్టివి బాధింపకయే శిశువునందుమాత్రము తలయెత్తుటకద్దు. శరీరసంబంధమైనను మనస్సంబంధమైనను కొన్నిలోపములు పితరులలో నొక్కరికిమాత్రమే యున్నచో నట్టిలోపములు కొంతవఱకుమాత్రమే శిశువునకబ్బుననియును; అట్టిశిశువులు పెరిగి పెద్దవారైనతర్వాత పరిపూర్ణారోగ్యవంతులను వివాహమైనచో వారివారియందలి లోపములు తమసంతానమున కంటకయే క్రమముగ నదృశ్యమగును. అందులకే మనవారు రక్తస్పర్శగలవారిని వివాహమాడరాదని నిషేధించియున్నారు. రక్తస్పర్శగలవారికేదేని లోపములున్నచో నట్టిదంపతుల

కిద్దఱికిని లోపములుండును. అట్టిలోపములు వారిసంతానమునందు ద్విగుణీకృతమగుననెడు భీతియే యిట్టినిషేధమునకు దారితీసియుండును.

ఈజీవాణువులు బొందెడు పరివర్తనము ననుసరించుకొనియే కవలలు సహితము జనించుచున్నారు. వీరొకప్పుడు మాతృయండాశయమునందలి యొక జీవాణువునుండియే జనించుచున్నారు. అట్టివారల యుత్పత్తియొకటే యణువువలన గల్గును గనుక వారిగుణగణములు నాకారముగూడ నొక్కటిగనే యుండును. వారిని గుర్తించుటగూడ కష్టతరమే. వారిభావనలుగూడ నొకటేతీరుగనుండును. అట్టివారు వివిధదేశమునందుండినను నేకకాలమున నొకటే కార్య మాచరింతురట!

### పిండము—పరిసరములకు దానిపైగల ప్రభావము

మనము శిశువు చేటలోఁబడినప్పటినుండిమాత్రమే దాని నమితశ్రద్ధతోఁ జూచుచున్నాము. కాని మాతృగర్భమునందున్నతరి దానివిషయ మంతగా శ్రద్ధబుచ్చుకొనుటలేదు. అప్పుడుఁగూడ పరిసరములు దానిలో నెన్నియో మార్పులను జనింపఁజేయుచున్నవి. పితరులు త్రాగుబోఁతులైనచో వారలకు జన్మించుశిశువు బలహీనుఁడై పుట్టుటయుకద్దు. క్షయరోగముతో తల్లిదండ్రులలో నెవ్వరేని బాధపడువారలైనచో నట్టిక్షయ మొదలగు వ్యాధులు గర్భస్థుఁడగుశిశువు నంటునని కొంతమంది యభిప్రాయము. కాని నవీనశాస్త్రవేత్త లది జరుగుటలేదని వక్కాణించియున్నారు. శిశువు మాతృసంబంధమగు నండాశయమందున్నపుడు తల్లిరక్తమువలననే యది

పోషింపఁబడుచున్నది. శిశువునుండి కల్మషముతోఁగూడిన రక్తము తల్లిహృదయములోనికిబోయి మఱల పరిశుభ్రపఱుపఁబడుచున్నది. అటుల పోషించుటకే గర్భిణీస్త్రీలయందు సామాన్యముగ ఋతుస్రావ మాగిపోవుచున్నది.

శిశువండాశయమునందున్నపుడు తల్లియనుభవించు సుఖదుఃఖములు శిశువు నొకవింతరీతిగా నంటుచున్నవి. గర్భిణికి బటానీలపై మక్కువగలైననుకొనుఁడు. ఆమె కట్టిమక్కువ తీరనిచో బటానివంటి మచ్చయొకటి శిశువు నొడలిపై యగుపడుచున్నది. పుట్టుమచ్చలు సాధారణముగ నిట్టికారణములకే గల్గుచున్నవి. ఒకప్పుడొకగర్భిణి తనభర్తచేయి విరిగిపోగా వైద్యశాలయందు శస్త్రచికిత్స గావింపఁబడుటజూచి యడలజొచ్చెనట. ఆమెప్రసవించినపుడాపసిగందు చేతిపైన నొకమచ్చ యుండెనట. ఇంకొకగర్భిణి బెత్తముపుచ్చుకొని వంగిపోయి భిక్షాటనము జేయుచున్న వయోవృద్ధుని స్థితికి జాలిజెందెనట. ఆమెకుగల్గిన శిశువుచేతిపై బెత్తమువంటి మచ్చయొకటి పొడువుగా గానబడెనట. ఇందులకే మనవారు గ్రహణమునాడు మొఱ్ఱకిపట్టిన చంద్రుని గర్భిణులజూడనీరు. అట్లు చూచినవారికి గల్గుబిడ్డలున్నూ తప్పక గ్రహణపుమొఱ్ఱకలవారే యగుచున్నారు.

ఫ్రెడ్ గొట్ట మొదలగువారు గర్భిణియగు తల్లి సరియైన యాహారమును భుజించి తనయారోగ్యమును కాపాడుకొనకపోయినచో నామెకు గల్గుబిడ్డడు దుర్బలుఁడును, మనోవైకల్యముగలవాఁడు నై జనించునని నుడువుచున్నారు.

క్షయ మొదలగు సంటురోగములతో బాధపడు తల్లులు తగుజాగ్రత్త వహింపవలయును.

తల్లిశరీరమునందు కొన్నివిషము లేర్పడునపు డవి గర్భస్థుడగు నర్భకునకు మోసముదెచ్చును. గర్భిణుల యుదరములోనికి సీసము మొదలైనపదార్థములు పోఁగూడదు. అట్లుపోయినచో గర్భస్రావముగల్గును. గర్భిణి చాలినంత ద్రవపదార్థమును గ్రోలనిచో నామెకు మూఢులు జనింతురు. అదియునుంగాక పిండోత్పత్తికాలమున మాతాపితరులకుగల్గు నానందము, దుఃఖము, మనోవికాసము మొదలగు భావములుగూడ కొంతవఱకు గర్భస్థునిపై ప్రోద్బలమువహించుచునే యుండును.

### తల్లి మనోభావములు—పిండముపై వానికిగల ప్రభావము

తల్లి గర్భకాలమున ననుభవించెడు నుద్రేకాదులను చాలవఱకు బిడ్డనికి సంక్రమింపఁజేయుచున్నది. నెపోలియనుచక్రవర్తితల్లి తనభర్తతో యుద్ధభూమికేతెంచి గర్భిణియయ్యును భర్తతోఁబాటు కష్టసుఖముల ననుభవించెనట. అందులకే యామెకు జగద్విఖ్యాతపాత్రుఁడగు నెపోలియను చక్రవర్తి యుదయించెను.

ఒకప్పు డొకయావు పొర్లుసమయమున నొకయాలకాపరి దానికొక పొడలకఱ్ఱను జూపెనఁట; తత్ఫలితముగ దానికి మచ్చలుగలదూడ బుట్టెను.

---

## ౨

# గర్భిణుల విషయములు

చాలమంది గర్భమును నిజముగ ధరించకపోయి నను ముచ్చటకు "మా అమ్మాయికి నెలతప్పి"న దని మనలో కొంద ఱుబ్బి తబ్బిబ్బులగుదురు. అయినను కొన్ని చిన్నె లేస్త్రీయందు గనంబడునో యాస్త్రీ గర్భముధరించి నటుల ఋజువగును. అధోనిర్దిష్టములగు చిహ్నములలో నేయొకటో గానవచ్చినచో నతిత్వరితముగ గర్భమని నిర్ణ యించుటకు వలనుపడదు. కొందఱికి కడుపులో బల్ల పెరు గుటవలన గర్భిణులవలె గానవచ్చుటయు సహజము. అయి దవ మాసము పైఁబడగనే వైద్యునిచే గర్భమో కాదో పరీక్ష చేయించుకొను టుచితము. క్రమముగ బహిష్టగు వారికి నెలతప్పినచో గర్భమనియనుకొనుటకు వీలున్నది. ఒకనెలకే స్తనములు కొంచెము స్థూలములై నునుపె క్కును. వేవిళ్లు కొందఱిని బాధపెట్టును. పొత్తికడుపుబ్బు కుట మూడు లేక నాల్గవమాసము వచ్చువఱకును కను బడదు. అయిదవమాసము రాగనే పిల్ల తిరుగుటకు మొద లిడును. ఇట్టిచర్య గర్భమును తప్పక నిర్ణయించునుగదా! ఈక్రిందిపట్టిక సాహాయ్యమువలన ప్రసూతిసమయమును చదువరులు తమకు తామే నిర్ణయించుకొందురుగాత!:—

ఒకనెలకు, సంశ్లిష్టతగాంచిన పితరుల జీవాణువు లొక అరఅంగుళమువఱకు పెఱిగి, మెలిచుట్టుచుట్టుకొనిన యొకచేపవలె గానవచ్చును. రెండవమాసమున పిండ

మొకటంగుళమునకుపైగ నుండినను నిర్దిష్టరూపమును మాత్రము బడయుటలేదు. కాలక్రమమున పిండమున కవయవాదులేర్పడును. గర్భిణికి తగినయాహార మొసంగవలయును. అట్లొసంగకపోయినచో నామె బలహీనయగుటయేగాక గర్భముకూడ సరిగా వృద్ధిపొందనేరదు.

గర్భిణీస్త్రీ నెటుల పోషింపవలయునో యించుక విచారింతము. వేకటికి తగినంత శరీరవ్యాయామ ముండవలయును. ఆమెకు తగిన వ్యాయామముండినచో సుఖప్రసవమగును. గర్భిణి చేతులు భుజములపైకెత్తి బట్టలు మొదలైనవి యారవేయకూడదు. ఆమె విశ్రాంతి యెక్కువగఁ దీసికొనవలయును.

గర్భిణులు కొంచెమెక్కువగ నాహారము తినుట మనమందఱ మెఱిగినవిషయమేగదా! గర్భధారణసమయమున స్త్రీలకు పాలు మంచియాహారమగును. వారు కొంచె మెక్కువగ నాకుకూరలుగూడ దినుచుండవలయును. ఆకుకూరలయం దినుముండును. ఎక్కువగ దబ్బకాయ, నారింజకాయ, కమలాఫలములు, నిమ్మకాయలు గర్భిణులకు తగులవలయును, గర్భిణుల పండ్లకు జబ్బుచేయుట మనమెఱింగియేయున్నాము. అందులకే కొందఱు బాలింతరాండ్రు పండ్లకు కప్పుతోముచుందురు. గర్భిణులు సూనెదినుసుల నెక్కువగ వాడినచో పండ్ల జబ్బునకు గుఱికారు.

ఇఁక రెండుమూడు మాసములకు ప్రసవింతురనగా గర్భిణుల చూచుకములవిషయము తగినంత శ్రద్ధవహింపవలయును. వానిని బాగుగ సినుదినమును కడిగి కొంచె

మాముదముతో మర్దనచేసినచో పాప మాయబలలకు బాధతప్పును. ఆరవమాసముననే యొకప్పుడు నొప్పులా రంభించును. అట్టిసమయమున సజీవమగు శిశువు జనించుటరుదు. ఎనిమిదవమాసము దాటినపిమ్మట బుట్టెడు బిడ్డలు జీవముతోనె జనింతురు. వైద్యులసలహా గైకొనినచో నకాలమున నొప్పులురాకుండు ప్రకరణమును వివరింతురు. ప్రసవమగుటకు రెండుమాసములు ముందు గర్భిణికి మలబద్ధకమేర్పడును. మందముజేసెడు వస్తువుల దినకుండునట్టియెడ గర్భిణు లొడలుకాపాడుకొనుట శ్రేయోదాయకము. గర్భిణులు క్రమముగ నుచితభోజనము చేయుచో గుండెలలో మంట పసరు పేరుకొనుట మున్నగు బాధలకు గురికారు.

### నొప్పులు

అనుభవజ్ఞులగువారు నొప్పులువచ్చు సమయమును బాగుగ గుర్తింపగల్గుదురు. కాని క్రొత్తవారైనచో నొప్పులువచ్చుటకు నాలుగైదుదినములు ముందే యేపొత్తికడుపులోనో నులినొప్పి మొదలుపెట్టినను, అవే నొప్పులని యాతుర్దా పడుదురు. నొప్పులు మొదట సన్నముగ నడుములో ప్రారంభించి గర్భమునందు మెలిబెట్టును. ఈ విషయ మింతకంటె నెక్కువ వ్రాయు టుచితముకాదు.

ఆస్పత్రులకు కనుటకు పోవునపుడు గర్భిణులు కడుంగడు జాగ్రత్తతో నుండవలయును. అక్కడ వారికి కొన్నియంటురోగములు తగులవచ్చును. వీరితోపాటు కనుట కాస్పత్రికి వచ్చినవారిరోగములు వీరికి సంక్రమింపవచ్చును. అందఱు నచ్చటిగదులు మంచములు నుపయో

గింతురుగదా! మున్నుండట్టిరోగములు గలవారు వాడిన పనిముట్లు మొదలైనవి వాడుటవలన నట్టిరోగములు సంక్రమించును. ఒకగదిలో మనము ప్రవేశించుటకుముందు, ఆగదికి బాగా పొగవేయవలయును. మంత్రసానులలో కొందఱికి చెడురోగము లుండవచ్చును. కనుక వారితో గర్భిణులు బహుజాగరూకతగ మెలగవలయును. కొఱుకు మొదలైన రోగములున్న దంపతులకుఁ బుట్టినబిడ్డలు విశేషముగ మరణించుట మనము సాధారణముగ జూచుచున్నారముగదా! వారివిషయము పితరులు తగుశ్రద్ధ వహించి మందుమాకులిప్పించినచో వారట్లాకురాలునట్లు రాలకుందురు.

---

## 3
## బిడ్డల పెంపకము

బిడ్డలు సాధారణముగ మొదటివత్సరమునందే శీఘ్రముగ తోఁటకూరకాడవలె పెరుగుదురు. వానికారోగ్యమును ప్రసాదింపనెంచిన తల్లులుచితాహారదానము వలనను నెల్లపుడు బిడ్డను కంటికిరెప్పవలె కాపాడుటచే కృతకృత్యలగుదురు.

తల్లిస్తన్యమే బిడ్డకుత్తమోత్తమము. ఈనాటికాలమున స్త్రీలుసహితము రాచకార్యములందు పాల్గొని కాలమునంతయు నెట్లో వ్యయించుచుండిరిగదా! అట్టివారికి బిడ్డకుపాలిచ్చుటకు సమయముచిక్కుటరుదు. ఎట్లో

సందుచేసికొని స్తన్యమును తనశిశువున కొసంగెడుమాత యాశిశువున కెంతయో యుపకారము చేసినదానిలో లెక్క.

అయినను కొందఱుతల్లులు తమబిడ్డలకు పాలిచ్చి వారిని మిత్తి నోటబెట్టుచున్నారు. క్షయవ్యాధివలన బాధపడు తల్లులును, తమయారోగ్యము సరిగాలేనివారును తమబిడ్డలకు చాలినన్నిపాలు తమయొద్దనున్నవో లేవో యని తహతహబడువారును బిడ్డలకు పాలీయరాదు. ఎప్పుడును తల్లి గిల్లి కజ్జాలుపెట్టుకొనినను, ఆమెకేదేని యాశాభంగము గల్గినను, విషాదకరమగువార్త వినినను ఆమెదగ్గర పాలెండిపోవును. కాని తిరిగి యామె యారోగ్యమును పొందినపిమ్మట మొదటివలెనే యామెయొద్ద సమృద్ధిగ పాలుండును. తల్లి పాలిచ్చుటకు వీలులేనప్పుడు యోగ్యురాలై యెట్టిరుగ్మతయులేని దాదిచేత పసివానికి పాలిప్పించవలయును. అట్టిదాది దొరకనిచో మంచియావుపాలు బిడ్డని కిచ్చుట మంచిది.

పండ్లువచ్చు సమయమునందు శిశువిషయము తల్లి శ్రద్ధవహింపవలయును. సాధారణముగ నారవమాసము పైబడగనే బిడ్డలకు పండ్లువచ్చును. కొందఱికి శీఘ్రముగను మఱికొందఱి కాలశ్యముగను పండ్లువచ్చును. పాలపండ్లేగదా యని, బిడ్డలపండ్లు గొగ్గులుగవచ్చినను నొప్పియెత్తినను తగినంత శ్రద్ధవహింపకుండ యూరుకొనరాదు. దంతవైద్యునిచే పాలపండ్లకుగల్గు వ్యాధులన్నింటిని వెంటనే రహితముచేయించవలయును. మొదట పలువరుస సరిగనుండిననేతప్ప యాఁడివచ్చినతర్వాత నది వంకరటిం

కరట్కులేక సరిగనుండదు. పాలపండ్లురాగనే బిడ్డ ఘన పదార్థమునుగూడ మెక్కఁగలదని మనమర్థముచేసికొన వలయును. పుట్టుకతోడనే బిడ్డ కిరువదిపండ్లు చిగుళ్ళచాటున దాగియుండి యవివే కొన్నిమాసములైనపిమ్మట బయటపడుచున్నవి. పండ్లువచ్చుసమయమున బిడ్డలు విరేచనములచే బాధపడుదురు. అప్పుడే బిడ్డలు దేనినిపట్టినను కఱచుచుందురు. అట్టియెడ విటమిను డి అధికముగ వారికొసంగవలయును. అదియే యెముకలకు పుష్టినొసంగునది. ఈసమయమున ననేకరోగములకు తమబుడుతలు గుఱియగుదురని కొందఱుతల్లులు అల్లటతల్లట్లు గుడుతురు. వారియారోగ్యమువిషయము తల్లులు తగినంత శ్రద్ధవహించినచో వారినెట్టివ్యాధులును చెనకవు.

కొంచెము పెద్దవారైనపిమ్మట పిల్లలకాటబొమ్మలన తగనిప్రేమ. వారికి నచ్చినబొమ్మలు కొనియిచ్చు బాధ్యత తల్లిదండ్రులది. అట్టిబొమ్మలను బిడ్డలకొసంగుటకుముం దెట్టివి వారియారోగ్యమునకు ప్రతిబంధకరములో మన మాలోచించవలయును. అట్టితరుణమున బిడ్డ కేవస్తు విచ్చినను నోటిలోపెట్టుకొనుచుండుట మనమెఱింగియే యుంటిమిగదా! రంగుపూసిన బొమ్మలు అందును ఆకుపచ్చరంగు పూసినవి వారి కొసంగరాదు. అట్టివి వారు నోటిలో పెట్టుకొనినచో తప్పక ముప్పువచ్చును. సీనారేకు డబ్బాలతోఁజేసిన బొమ్మలిచ్చిన వారువానితో వేడలు కోసికొనవచ్చును. రబ్బరుబొమ్మలు వారి కిచ్చినచో వారు వానిని కొరికి కొంచెముకొంచెముగ మింగివేయవచ్చును. శెల్యులాయిడు బొమ్మలైనచో నిప్పంటుకొని వారి

కషాయకరము లగును.

బిడ్డలను స్నానముచేయించుటెట్లో యిఁకముందు కొంతవఱకు విచారింతము. ఈవిషయమై మనభారతదేశమునందలి తల్లు లెంతరో యనుభవము గడించియే యున్నారు. వారి కెట్లు స్నానముచేయించవలసినదియు నేను వ్రాయను. కాని యేయేకాలములందు బిడ్డలను స్నానము చేయించు టుచితమో మొదలగు విషయములను మాత్రము కొంతవఱకు వివరింతును. పాలిచ్చినతర్వాత గంటకులోపుగాగాని పాలిచ్చుటకుపూర్వ మరగంటకు ముందుగాని బిడ్డలను జలకమాడింపరాదు. పిల్లవానిని స్నానమునకు తీసికొనివెళ్ళుటకుముందే యుపకరణము లన్నింటిని సిద్ధముచేసికొని యుండవలయును. అట్లయినచో వాని నెక్కువకాలము నానబెట్టకుండ పోవును. పొత్తెళ్ళగుడ్డలు మొదలైనవి అల్పాచమానాదులచే చెడును. కనుక నట్టివానిని పదేపదే మార్చుచుండవలెను.

బిడ్డ పసిబట్టి యేడ్చునపుడు హేతువును మనమారయవలెను. వానిబట్టలు తడిసినవా? చలివేయుచున్నదా? యుక్కపోయుచున్నదా? పక్కవత్తుకొనుచున్నదా? ఆకలి యైనదా? చెవిఁలో పోటా? చేతులు కాళ్లు మొదలైనవి మెలివైచుకొనెనా? చీమలో దోమలో తొందరజేయుచున్నవా? అజీర్ణమో మలబద్ధమో వానినేడ్పించుచున్నదా? మన మారయవలయును.

తల్లిదండ్రులవ్యాధులు బిడ్డలనంటుచున్నవా ?

వ్యాధులు వన్యమృగములను సహితము బాధించును. అయినను మానవులని పీడించినటుల రుజ క్రవ్యాదుల

జెనకద్దాయెను. కతమేమి? మృగములు సహజజీవనమును నెరపుచుండును. మానవుఁడన్ననో ప్రకృతి విరుద్ధముగ మెలఁగి దురభ్యాసములకు లోనగుటవలన రోగమునకు గురియై గతించుచున్నాడు. వ్యాధితో పీడింపబడు మృగములు సంతానమును బడయకనే మరణించును. మానవుఁడు వైద్యసాహాయ్యమున తెప్పిరిలి తనరోగమును తన సంతానమునకు సంక్రమింపఁజేయును. ఇదియునుగాక మనుష్యుఁ డటవీజాతులన్నింటికంటెను ప్రాయమున చిన్నవాఁడు. మృగము లనాదిసిద్ధములై దార్ఢ్యయుక్తములై యొప్పారుచుండుటవలన వ్యాధులకు లొంగవాయెను. మానవుని సహచర్యమువలన క్రవ్యాదులకు వ్యాధులంటుటయుకద్దు. మనోవ్యాకులతయు మానవునకు వ్యాధులను దెచ్చిపెట్టుటకు నవకాశముగలదు.

శిశువొకప్పుడు పుట్టుచునే పితరులలో నొకరికిగాని యిద్దఱకుగాని గల్గువ్యాధులను బడయుట మనముజూచుచున్నాము. అట్టివ్యాధి జన్మనఃపూర్వము పిండమునంటియుండవచ్చును. అంటువ్యాధులు గర్భమునంటకుండు నటుల మావి సదా యప్రమత్తతఁజూపుచునే యుండును. అయినను రోగకీటకములు బలవత్తరములైనచో గర్భమును ప్రవేశించును. తల్లిదండ్రులరోగములు కాకుండినను రోగబీజములయిన నొకప్పుడు బిడ్డలకంటును. కొన్ని వ్యాధులు జననీజనకులం దుండుటవలనమాత్రమే బిడ్డలకు సంక్రమించుటలేదు. అట్టివ్యాధులు జననీజనకులెట్టిపుట్టువు పోషణమునకులోనైరో యట్టిపోషణమునే వారిసంతానముగూడ బడయుటవలన నేర్పడుచున్నవి. అట్టివారు

వారిబిడ్డల పెట్టుపోతలు మొదలగు విషయములందు మార్పు జేయవలయును. ఏవ్యాధియైనను సంతానప్రాప్తికిపూర్వము రహితమైనచో నది సంతానమును చెనకదు. దీర్ఘవ్యాధిబాధితులగు పితరులకు జనించెడు బిడ్డలు తప్పక వ్యాధిగ్రస్తులయ్యెదరు. అట్టివారు వివాహము లేకుండుట మంచిది. ఒకతూరి యొకప్రబలవ్యాధి మానవుని కంటినచో నట్టిక్రిములు చావక వానిశరీరమునందు నలుబది సంవత్సరములపాటుండును. ఇట్టి వ్యాధులుగలవారికి వ్యాధులు లేనివారితో వివాహములు తరచుగా తరతరములు జరుగుచుండినచో కొన్నితరములు గడచిన తర్వాత నట్టిరోగలక్షణములు తత్సంతానమునం దదృశ్యతఁ జెందవచ్చును.

### రోగనిరోధకత్వము

ఇది శరీరజనితము కావచ్చును, లేక నొకవేళ నార్జితమైనవగును. అనేకవిధముల నది యార్జితమగును. ఒకవ్యాధిచే పీడితుఁడై మృత్యుగహ్వరమునుండి తప్పించుకొనినవాని రుగ్ణత యార్జితమగును. అట్టివారికి సాధారణముగ నావ్యాధివలన ప్రాణభయముండదు. పెద్దమ్మవారు పడ్డవారివిషయము మనమిట్టులనే భావించుచుందుముగదా ! అదియునుగాక ఆవ్యాధిసంబంధమగు పానకముతో టీకాలువేయుటవలనగూడ నిట్టి వ్యాధినిరోధకత్వ మేర్పడుచున్నది.

ఇట్టు లార్జితమగు గుణమే తల్లినుండి శిశువున కజరాయువుద్వారా సంక్రమింపవచ్చును. మశూచికము పడిన తల్లిగర్భమునందలి పిండముసహితము అట్టివ్యాధి

యుఁకముందు దానికంటకుండుగుణమును బడయగలిదని నిరూపితమైనది.

వ్యాధులు పెద్దవారికంటె పిల్లల నెక్కువగ మట్టు బెట్టుటెందులకో మీకు తెలియునా? బిడ్డని కంతకు ముం దెట్టివ్యాధియును వచ్చియుండదు గనక నట్టివ్యాధి నెదు ర్కొనుటకు తగిన బీజజాలమాతని శరీరమునం దుత్పన్నము కాలేదని యర్థము.

శరీరారోగ్యశాస్త్రము నవీనౌషధతత్త్వజ్ఞానము వృద్ధినొందుటవలన నెట్టిరోగమునైనను కొంతవఱకరిక ట్టుటకు వలనుపడుచున్నది. కొన్నిరోగములు మానవశరీ రమునందు విషపదార్థముల నుత్పాదించుచున్నవి. అట్టి విషము ననాయాసముగ ననుభవజ్ఞులగు వైద్యులు నివా రింప నోపుదురు.

### పసిబిడ్డలు

పుట్టుకతోడనే బిడ్డజీవనమును ప్రారంభించుట లేదు. తల్లిగర్భమున పడగనే పిండము సహితము జీవ చిహ్నముల నగపఱచుచున్నది. పిండము దినదినాభివృద్ధి గాంచిన కొలదియు స్వకార్యముల నెరపగల్గును. కాని వెలుఁగుధ్వని మొదలగునవి మాతృ గర్భస్థుఁడగు నర్భకు నెంతమాత్రము చెనకుటలేదు. జరాయువుగుండా పిండము లోనికి ప్రవేశించి దానిని పెంపొందఁజేసెడు తల్లిరక్తము నందలి మార్పులు సహితము పిండముపై ప్రోద్బలము వహించుచునే యుండును.

అయిదవ మాసమురాగనే పిండమునకు వెన్నెము కలును మజ్జాచ్ఛదములు నేర్పడును. అప్పటినుండియు నది

మాతృగర్భమునందు తిరుగుటకు మొదలిడును. ఇట్టి కదలికయే శిశుసంబంధమగు భావిజంగమజీవనమునకు సోపానములని చెప్పుట యెంతమాత్ర మతిశయోక్తి కాదు.

చేటలో పడగనే బిడ్డ ఏడ్పు మొదలిడుచున్నది. అట్టియేడ్పే శిశువునందు కొంతవఱకు భావము లుదయించినవని స్పష్టపఱచుచున్నది. మాతృగర్భమున నున్నంత కాలము బిడ్డని బహిఃప్రపంచమునందలి శీతము ధ్వనులు మొదలైనవి భయపెట్టలేకున్నవి. కాని బయటపడగనే యట్టి ప్రకృతికృత్యములకును, తనకును పూర్వపరిచయ మిసుమంతయు లేనందున బుడుతడు కలతజెంది రోదన మారంభించుచున్నాడు. బిడ్డ యేడ్చునపుడు కంట నీరు పెట్టునో లేదో మీరు పరిశీలించితిరా? జన్మించిన కొన్నిదినములవఱకును నశ్రుకణములన నెట్టివో బిడ్డ యెఱుగనే యెఱుఁగదు. కొందఱుబిడ్డలు నాల్గుమాసములు పైఁబడు వఱకు నశ్రుపాతము నెఱుఁగరఁట. బిడ్డ పరిసరములందలి జీవజాతులన్నింటికంటెను నుత్కృష్టమైనదని దానియేడ్పే వేనోళ్ళచాటును. అట్టిరోదనము ప్రకృతి పసిగందుకంటె భిన్నము కాదనియును, అట్టిప్రకృతిని స్వప్రయోజనమునకై వినియోగించుటకే బుడుతఁడు జనించెననియు నావిష్కరించునట. ఒకరు పసిబిడ్డ యీలోకమున ప్రవేశింపగనే ప్రకృతితో సాయుజ్యము జెందవలసివచ్చెనని బహుధా చింతించి దానిదుఃఖము నీచందంబున వ్యక్తపఱచునని నుడివిరి. కాంటుపండితుఁడు బిడ్డ నడయాడుటకు నిచ్చగించియు నటులొనరింపఁజాలనందులకు పలవించుచున్నదనిరి. అదియునుంగాక బొడ్డుకోయగనే మావిగుండా తనశరీర

ములోనికి రక్తము ప్రవహింపక హఠాత్తుగ ప్రసార మాగుటవలన నేడ్వవచ్చును.

ఒకవేళ జననకాలమునగల్గిన యొత్తిడివలననైనను బిడ్డరోదన మారంభింపనోపు. అయినప్పటికి జాతకుని యేడ్పు యాతఁడు సర్వప్రకృతికంటెను నతీతుఁడని తెలియజేయుచున్నదని వేరుగఁ జెప్పవలయునా? అందఱు బిడ్డలు నొకటే తీరున నేడ్చుటలేదు. కనుకనే మనవారు రోదనధ్వనుల వినినంత మాత్రముననే శిశు వాడుదియో మగవాడో కనుగొనగల్గియుండిరి. ఏడ్పునుబట్టియే బుడుతల గుణాగుణములను మనవారు నిర్ణయింపఁగల్గియుండిరి.

జననకాలమున బిడ్డ నిరాధారమై యుండును. సమస్తమును తల్లి చూడవలసినదే. తన యావశ్యకతల నన్నియు సైగలతో మాత్రమే తెలియజేయును. ఆహారాదిసౌకర్యముల నన్నింటిని గైకొనిన యనుక్షణమే నిద్రకు పడును. కొన్నిదినములు గడచినతర్వాత గాని పరిసరములతో పరిచయము దానికి గల్గదు. అంతయు సాధనమునగాని దానికి యలవడదు. అయితే పసిబిడ్డ యింత నిరాధారస్థితి యందుండెను గదా, జంతుజాలము మాత్రము పుట్టిన కొలఁదికాలముననే నడయాడగల్గుచున్నవే గతమేమి? వాని తల్లులు వానికీఁదగు సౌకర్యముల నొసంగు సామర్థ్యమును బడయలేదు గదా! కనుకనే యీశ్వరుఁడు పుట్టగనే జంతువుల కట్టి శక్తిని ప్రసాదించెను. నాగరికతకుఁ బ్రసిద్ధిగాంచిన జాతులలో బిడ్డలు పూర్ణవయస్సు వచ్చిననేగాని ప్రయోజకులు కానేరరు. కాని హీనజాతులందు బుట్టిన బిడుతలు సరిగా వికాసము

జెందనిదే యేదియో యొకకుంటిపని బూని స్వోదర పూరణదక్షు లగుచుండిరి.

నూతనముగ ప్రసూతయగు శిశువు సాధారణ ముగఁ జూడలేదు. కండ్లు మూసికొనియే యుండును. కాని చలి, వేడిమి మొదలగువాని ననుభవింపగలదు. రసనేంద్రియము వినియోగపఱచి భక్ష్యాభక్ష్యముల నిర్ణయింపఁ గలదు.

శిశుస్వభావము పరాధీనత ప్రతిఘటనలతో మిశ్రితమైయున్నది. క్రమముగా బిడ్డ తల్లి గొంతును గుర్తింప మొదలిడును. ఆమెస్పర్శ దాని నానందసాగరమున ముంచి యెత్తును. పరిచయములేనివారు తాకినచో విసువుజెందును. తనశయనాగారమునందలి దీపమును కదిపినచోఁ దనదృష్టి యాదీపమువై పునకు మరల్చును. ఈతీరున బిడ్డని మనస్సు పరిపక్వస్థితిని గాంచువఱకు పరివర్తనముల నందుచునే యుండును. బిడ్డ పెద్దదైనకొలఁదియు నాత్మాభిమానమునువీడి పరిసరములందు మగ్నమగును. హానికరములగు చర్యల నుజ్జగించి దాని శైశవము నిరతానందభాజనముగ జేయు భారము మతాపితరులదేగదా !

నిత్యాభివృద్ధిని బడయువలయుననెడు కోర్కెను బిడ్డ యావిష్కరించుచునేయున్నది. అపరిపూర్ణత నెన్నియో ఘట్టములు దాటిననేగాని బిడ్డ బడయుట కష్టము. ఈ విషయమున బిడ్డలకుఁ దోడ్పడదలఁచుకొనిన పితరులధోనిర్దిష్టములగు విషయముల గమనింప ప్రార్థితులు. బిడ్డనికి వారు కొంత స్వేచ్ఛనొసంగవలయును. సదా భుజములపై నిడుకొని మోసి బిడ్డ లెత్తుమరగిరని పితరులు

విసువుజెందరాదు. కొన్నినెలలు పైపడిన బిడ్డలకు సదా సదభ్యాసములను సూచింపవలయునేగాని యీపనిజేయు మది చేయకుమని బోధించినచో మనబోధనలన్నియువ్యర్థ ములగును.

నెలలబిడ్డ తన్నుకొనుటయన్నను, వస్తుగ్రహణము నందును, వ్రేలుకుడుచుటయందును నపారానందమును కనుపఱచును. ఈసమయముననే యది వివేకాభివృద్ధి నందును. తద్వారా యితరులు తన చేష్టల నామోదింప గల్గుచున్నారో లేదో నిర్ణయింపఁ గల్గుచున్నది. చుట్టు పట్లనుండువారి మనోభావములను సహిత మవగతము జేసికొనగలదు. ఉద్రేకభావములనుగూడ నిట్టి వయస్సు నందే గనుపఱచును. రెండునెలలదగుసరికే భయము బిడ్డనియందు పొడసూపును, కోపము నాల్గుమాసముల కును అనురాగ మంతకు ముందును శిశువునకు గల్గును.

రెండవ సంవత్సరము రాగానే శిశుజీవితమునందు మూడవఘట్టము పరిసమాప్తిజెందును. మూడవ ఘట్టపు ప్రారంభమున బిడ్డనియందు స్వాతంత్ర్యకాంక్ష యుద యించును. అట్టితరి దానియిచ్ఛవచ్చినట్టుల పైన నొకకంట పెద్దలు కనిపెట్టి మెలగనిచ్చుట శ్రేయో దాయకము. ఈతరుణముననే దానికి విధేయతయన నెట్టిదో బోధపరచుటకు తల్లిదండ్రులు యత్నింపవలయును. కాని నిర్బంధవిధానము నెంతమాత్రము నవలంబింప రాదు. ఈసమయముననే బుడుతలందు కల్పనాభిలాష మంకురించును. బిడ్డ లీతరుణమున పరిశోధనయు ననుకరణ మును ప్రారంభింతురు. బిడ్డలు భయపడినయెడల వారి

నెల్లపుడును గేలిచేయరాదు. బిడ్డని కేభయముండ వచ్చునో, యేభయము కూడదో నిర్ణయించి అట్టి కూడని భయము వాని నంటకుండ జూచెడిబాధ్యత పితరులదే. చీకటివలని భయము బిడ్డనికి కూడదు. క్రూరజంతువు వలని భయముండవలసినదే.

---

## ౪
## బిడ్డల రోగములు

### మలబద్ధకము

మలబద్ధకమునకు కారణము లెన్నియోగలవు. బిడ్డడు మలబద్ధకముచే నెందులకు బాధపడుచున్నాడో నిర్ణయించి యటు పిమ్మట చికిత్సవిషయ మాలోచించవలయును. ఆరోగ్యవంతులగు బిడ్డల విరేచనము కొంచెము పసుపుపచ్చగను పల్చగను నుండును. ఇరువదినాల్గు గంటలలో నొకటిమొదలు మూడు కాల విరోచనము లగును. తల్లిపాలు త్రాగుబిడ్డ డేదేని హేతువువలన, ఆవుపాలో డబ్బాపాలో త్రాగవలసివచ్చినపుడు విరేచనము పిట్టముకట్టి కష్టముగనగును. అట్టియెడ తల్లు లాతురత జూపరాదు. విరేచనములు యథాప్రకారవర్ణముగనుండియు సరిగ కాకపోయినచో పేగులకు సరియగు బలము లేనందున బిడ్డనికి సరిగ విరేచనము కాకపోవచ్చును. అట్టియెడ బొడ్డుచుట్టును కుడినుండి యెడమదిక్కునకు క్రిందివఱకును రాచుచుండవలయును. ఒకప్పు డాహారము చాలక మలబద్ధక మేర్పడవచ్చును. అట్టియెడ బిడ్డల కధికముగ నాహార మొసంగవలయును. ఒకప్పుడు తిండి యెక్కువయైనందువలనగూడ మలబద్ధకమునకు బుడుతలు గురియయ్యెదరు. గట్టిగ పిట్టముగట్టిన విరేచనము బిడ్డని యాహారమునందు తగినంత క్రొవ్వుపదార్థము లేదని తెలియజేయును. ఈవ్యాధి బిడ్డలయందు ముదిరినతర్వాత దీనిని

పెంచుటకు మనము పడరానిపాట్లు పడవలెను. అట్టియెడ కాఁచి చల్లారబెట్టిన మంచినీటిని బిడ్డల కెక్కువగ త్రాగుట కొసంగ వలెను. ఆరుమాసములకు పైబడిన బిడ్డలకు పండ్లరసము నొసంగి యీవ్యాధిని తంపవచ్చును.

## చిన్నబిడ్డనొప్పులు

బిడ్డలకు సాధారణముగ పండ్లువచ్చు తరుణముననే యీ వ్యాధివచ్చును. ఒకవేళ వీరు తినుతిండి చాలనందువలనను నిట్టి రోగము బిడ్డను బాధింపవచ్చును. ఈనొప్పులు రాగానే బిడ్డలున్న ట్లుండి విరుచుకు పడెదరు. కళ్లు తేలవేతురు. కాళ్లుచేతులు కట్టెల వలె నగును. మనవా రట్టితరుణమున త్రొక్కుడలాడ పనిలేదు. కొందఱు నొసట పొగచుట్టపెట్టి కాల్తురు. మఱికొందఱు పైకి బిడ్డ నెగురవేతురు. కొంచెము బాగుగ వేడిగనున్న నీటిలో స్నానముచేయించి తుడిచి తడిగుడ్డతో నెత్తిన రాయవలయును. రోగ బలము తగ్గి చెమటపట్టును. బిడ్డ వెంటనే నిద్రకు పడవచ్చును. తర్వాత కడుపునకు ఆముదము పెట్టినచో మలమంతయు కొట్టి వేయును. బిడ్డనికి కాంతివచ్చును. అవసరమైనచో వైద్యునిసలహా గైకొనుట మంచిది.

## నెత్తురుబంక విరేచనములు

బంకతోగూడిన నెత్తురు బిడ్డలొకప్పుడు పోయుదురు. అట్టి వారు ముక్కుచుందురు. పేగులలో మితిలేని బాధయుండును. ఈ వ్యాధి అజీర్ణమువలనగాని, పొట్టకు పొత్తికడుపునకు చల్లగాలి తగు లుటవలనగాని వచ్చును. బిడ్డ యెక్కువగ ముక్కుచుండినచో వైద్యుఁడు వచ్చులోపుగా పొత్తికడుపు వేడినీటితో కాయుట మంచిది.

## పచ్చకామెర్లు

చర్మము పచ్చనగును. మున్నువలె విరేచనములు పోతురు. చిన్న బిడ్డలందు సర్వసాధారణముగ నీలక్షణములు కనుపడును. అట్టియెడ వారికి ఉన్నిగుడ్డలు, వేసి చలితగులకుండ నుంచుట

మరిచిది. మనలో నట్టివారికి చెట్టుతిరగవేయించెడు నాచారము గలదుగదా !

## మలేరియా

ఇది దోమకాటువలన మనకు సంక్రమించును. కనుక బిడ్డల మంచములకు దోమతెరలు వేయుటమంచిది.

## పొంగు

పొంగు జలుబులో ప్రారంభించును. దగ్గు బయలుదేరును. గొంతు బొంగుపోవును. ముఖముబుకును. ముక్కుల్నవెంట వచ్చని గాలి బయలుదేరును. కళ్ళెఱ్ఱబారుటయేగాక నీరుగూడ వానివెంట కారును. నాల్గవనాటికి గొరవర్ణముగల మచ్చలు నొసటిపైనను మెడచుట్టును కనుపడును. మెడక్రింద బిళ్ళలుకూడ కట్టవచ్చును. తుట్టతుద కవి కాళ్ళవఱకును జారును. ఉద్రుతముగ నున్నపుడు జ్వరము ౧౦౩ మొదలు ౧౦౫ డిగ్రీలవఱకువచ్చును. మనవారు కల్లు దింపులు మొదలైనవి చేతురు. ఇది అంటువ్యాధి కనుక అట్టి రోగమువచ్చినవారిని విడిగనుంచుట మంచిది. సదా, కంటిని నోటిని పరిశుభ్రముగ నుంచవలయును. ప్రక్కమీద వేపమండలు వేయవల యును. ఇట్టి తరుణమున కడుపులో తుక్కుపేరుకొనకుండ చూడ వలయును.

## ఆటలమ్మ

పొంగువలెనే జ్వరముండును వంటికి బొబ్బలు లేచును. కొంచెము తగ్గినతర్వాత వేపాకుపొడుము నూనెతో కలిపి వంటికి రాచుచుండవలయును.

## గవదబిళ్ళలు

కొంచెము జ్వరమువచ్చును. రెండు చెవులక్రిందను నొప్పి పుట్టి వాచును. ఈవాపు మెడను దవుడలనుగూడ నుబుకునట్లు చేయును. రోగినోరు కదల్చలేడు. వాచినస్థలమందు అవిసియాకు పసరుపూసి పైన దూది నంటించవలయును. కొందఱు బంగారపు తీగలతో కాల్పింతురు. కడుపులో వలిలేకుండా చూడవలయును.

## వాంతులు

పాలు త్రాగగనే బిడ్డలను పరుండబెట్టవలయును. అట్లుకాక వారి నిటునటు త్రిప్పినచో వారు వాంతులు మొదలు పెట్టెదరు. వారికి కావలసినదానికంటె నెక్కుడ యాహార మొసంగినను వాంతులు బయలుదేరును. వాంతులతోపాటు కడుపులో నొప్పి కూడా యుండినచో వానిని వెంటనే వైద్యునకు చూపవలయును.

## కోరింతదగ్గు

మొదట గుండెలలో కొంచెము నొప్పి బయలుదేరును దగ్గు క్రమక్రమముగ హెచ్చును. కొంచెము జ్వరముకాయును. కళ్ళె కూడనుండును. అట్టివ్యాధికి గురియైన బిడ్డలను విశాలమై తగినంత గాలి వచ్చెడి ప్రదేశమునందు త్రిప్పుచుండవలయును. మనవారిలో దీని నడచివేయుటకు కోరింతత్రాళ్లు వేయించి యట్టి బిడ్డల మెడలో కట్టు నాచారముగలదు. ఇదియునుంగాక వెలిగారమును నిప్పుమీద పొంగించి పొడిచేసి యాపొడిని పటికబెల్లపు పొడితో కలిపి నీటిలోవేసి యానీటిలో బొమ్మజెముడు పండురసముకల్పి బిడ్డలకు త్రాగనిచ్చినచో నీవ్యాధి కుదురును.

## నాసార్శిపములు

ముక్కులో నీపేరుతో ద్రాలెడు కండలు కొందఱి బిడ్డల కుబుకును. ఈవ్యాధితో పీడింపఁబడువారు సరిగ వినలేరు. వారికి రుచి సరిగా తెలియదు. బిడ్డలు సదాముక్కుతో మాత్రమే శ్వాసించునటుల మనము చూడవలయును, ఈకండలు పెరిగినవారు నోరు తెఱచి మాత్రమే యూపిరిపీల్తురు. గురక మొదలిడుదురు. వారి మొగము పాలిపోవును, వారిని వెంటనే వైద్యునకుఁ జూపవలయును.

## జలుబు

బిడ్డలకు త్వరితముగ జలుబుచేయును. నీటిలోనికి వారిని పోనీయరాదు. జలుబుచేసినవారు బిడ్డలను ముద్దాడినచో బిడ్డలకుకూడ

వెంటనే జలుబుచేయును. కనుక అట్టివారిని మన బిడ్డలను ముద్దాడ నీయరాదు. బిడ్డలకు వాతమెందులకుఁ జేయుచున్నదో మీ రెరుగుదురా? వారికి తగని యాహారమొసంగినను నొక్కనొక్క వారిని తిన బెట్టినను, ఎక్కువ తీపిపదార్థములు తిన్నను, త్వరితముగ నాహారమును మింగినను వానికి మలబద్ధకము జేసినను, సకాలమున కాహారమొసంగక పోయినను. తడిసినగుడ్డలు ప్రక్కమీద నుంచినను. అట్టి వారిని బాగుగ వేడినీటితో స్నానముచేయించి పొట్టచుట్టును ఉన్ని గుడ్డలు చుట్టవలయును.

---

౫

# బిడ్డలు—నిద్ర

బిడ్డ యాచరించు ప్రతికార్యమును మెదడు తగు సలహాల నొసంగుటవలననే వలనుపడుచున్నది. నిద్రించుతరి మెదడు కొంత విశ్రాంతిని గైకొనినను పరిపూర్ణముగ నది నిర్వ్యాపారత గాంచుట లేదు. హృదయము మొదలగు నవయవాదులపై కొంత యజమాయిదీ పుచ్చుకొనవలసియుండునుగదా! పరిపూర్ణారోగ్యము ననుభవించు బిడ్డ సుఖనిద్ర జెందును. ఒకప్పుడు బిడ్డ నిద్రజెందనితరి తల్లులుయ్యేల నూపుటగాని, లాలిపాట పాడుటగాని మంచిదికాదు. వారికి మన మిట్టి దురభ్యాసముల నేర్పరాదు. తొట్టెలో బిడ్డని యూచినచో దాని బెంపరేచరు తగ్గును. మొదటి రెండువారముల పాప దినమునకు రెండుగంటలు మేల్కొనియుండిన చాలును. ౧ మొదలు ౨ సంవత్సరముల పిల్లలు దినమునకు ౧౬ మొదలు ౧౮ గంటలును, ౨ మొదలు ౩ సంవత్సరముల బిడ్డలు ౧౫ మొదలు ౧౭ గంటలవఱకును, ౩ మొదలు ౪ సంవత్సరముల బిడ్డలు ౧౪ మొదలు ౧౬ గంటలవఱకును, ౪ మొదలు ౬ సంవత్సరముల బిడ్డలు ౧౩ మొదలు ౧౫ గంటలవఱకును, ౬ మొదలు ౯ సంవత్సరముల బిడ్డలు ౧౦ మొదలు ౧౨ గంటలవఱకును, ౯ మొదలు ౧౩ సంవత్సరముల బిడ్డలు

౮. మొదలు ౧౦ గంటలవఱకును నిద్రపోవలయును. ౧౩ మొదలు ౧౯ సంవత్సరములవఱకు నెదిగెడుదినములు గనుక కొంతవఱకు నిద్ర యెక్కువపోవు టుచితమే. ఈకాలము దాటగనే మఱల ౬ మొదలు ౮ గంటలవఱకు నిద్రచాలును. శిశువునకైనను వీలయినంతవఱకు తక్కువనిద్రయే మంచిది. బిడ్డ జన్మించినదిమొద లేదో యొకవిధమైన విద్యనభ్యసించుచుండవలయును. అట్లుకాక యెప్పుడును నిద్రపోవుచుండినచో తనపరిసరముల గుర్తెఱుంగక జ్ఞానవిహీనుఁడగును. బిడ్డనికాలమును వృథాపుచ్చక యాతని వివేకపథమును పట్టించుట తల్లిదండ్రుల విధియైయున్నది.

ఏడేండ్లు పైబడువఱకును మస్తిష్కము బుడుతనియం దతిశీఘ్రముగ వృద్ధిపొందుచుండును గనుక నాతని కాసమయమున నిద్ర యత్యవసరము. అయినను నిదురించెడికాలము వ్యక్తులనుబట్టి మారుచుండును. బిడ్డలనిద్ర సాధారణముగ శీతోష్ణస్థితియు వారిస్థితిగతులమీదను నాధారపడియుండును. కొందఱుబిడ్డలు మారాముపట్టి నిద్రపోకుండు టెందులకో మీకు తెలియునా?

కండ్లనెక్కువగ నుపయోగించిన రాత్రి నిద్రపట్టుట సున్న. పెద్దవారలు తిరుగుచుండెడు గదులందు బిడ్డలను పడుకొనబెట్టరాదు. ఒకపక్కయందే యిద్దరు ముగ్గురు బిడ్డలనుఁ పడుకొన బెట్టరాదు. అలిపిరికి పిల్లలు సాధారణముగ నిద్రాభంగము జెందుచుందురు. దానికి వారు గాంచెడి దుస్స్వప్నములే కారణములు. ఇట్టి దుస్స్వప్నములు నాసార్శ్వముల వలనను, అపస్మారకపు చిన్నెలు వీరియందు తలయెత్తుటవలనను గల్గుచున్నది. కొకిచమ్మల వలన బాధపడువారికి సాధారణముగ రక్తము మెడటినుండి యొక్కపెట్టున శరీరమునకు వచ్చివేయుటవలన వారు నాలుక మొదలైనవి కొరుకుకొనుట సహజమే నిద్రయందు కేకలు వ్రాయువారు నాడీవ్యాధిపీడితులని మనము తెలిసికొనవచ్చును. ఎప్పుడును బిడ్డలొకేతీరున పలవరించుచున్నట్లయిన వారల కేదియో రుగ్మత చెనకనున్నదని పితరులు తెలిసికొని వారలను వైజ్యులకుఁ జూపవలయును. ప్రక్కలో నల్పాచమానముచేయు పిల్లలును నాడీ

వ్యాధిబాధితులై యుందురు, కొన్నిదురభ్యాసములు లేక హస్త ప్రయోగమునకు లోనగుటవలనను ఇదిపొసఁగును. గోళ్లుకొఱుకు పిల్లలు సాధారణముగ ప్రక్కలో నల్పాచమానము చేయుచుందురు. శరీరమునందలి పరాన్నభుక్కులు రేఁగుటచేతను బిడ్డ లీపని చేయుటకద్దు. ఏదెట్లున్నను సాయంకాల మైదుగంటలు మొదలుకొని ప్రత్యూషమువఱకును బిడ్డల కెక్కువగ పానీయము లొసంగరాదు. వాతాదిరోగములవలన బిడ్డలు శయ్యయందల్పాచమానము చేయుచుండినచో వారికి బార్లీగంజినిచ్చిన నట్టియభ్యాసమును వారు వీడుదురు. బిడ్డలు చదువుకొనుకాలము నాడుకొనుకాలము కంటె నెక్కువకాలము నిద్రపోవలెను. అయిన నధునాతనులు కొందరు శరీరవ్యాయామముగూడ కొంతవఱకు నిద్రచేయు నుపకారము చేయగలదని చెప్పుచుండిరి. బిడ్డలు శీతకాలమునందు వేసంగి కంటె నెక్కువకాలము నిద్రపోవలెను. పరుండుటకుముందు పసిగందుల మనము లుద్రిక్తములు గాకుండ మనము జూడవలయును.

నిద్ర సాధారణముగ మనయనుభవము, శిక్షణము, ఉద్రేకము. వ్యాయామము, శరీరతత్త్వము మనము గ్రోలెడి యాహారము మొదలగు విషయములపైన నాధారపడియుండును. నిద్రాకాలము వ్యక్తులనుబట్టి మారుచుండును. వృత్తియు పోషణములుగూడ సుఖనిద్రకు సాధనములు.

కొందఱు బిడ్డలు నిద్రపట్టక కళ్ళలో వత్తులువేసికొని కూర్చుండుటెందులకో యించుక యోచించితిరా? కొందఱుబిడ్డలు తమతల్లి ప్రక్కలో కూర్చొని యేవేవియో తొక్కుపలుకులు కొట్టిపోయుచు తాము నిదురకుపడినచో తమతల్లి యటనుండి మఱియొకగదిలోనికి వెళ్ళునేమోయనియును నపుడు తమసంగతి విచారించువారుండరనియు భయపడుదురు. ఎపుడునొకటే బండనిద్రయాయని బిడ్డల యెదుట పెద్దవారనినచో బిడ్డ లాపలుకులాలకించి తాము బండలుకాదను గర్వమునుజూపుచు నిద్రపోక భీష్మించుకొని కూర్చుండుటయుకద్దు. అజీర్ణముచే పీడింపఁబడు బిడ్డలకు సాధారణముగ నిద్రపట్టదు. ఒకవేళ పట్టినను పలవరింతలు, నాపసోపలును

మెదలిడుదురు. తండ్రి వింతవస్తువును కొనితెచ్చిననాడు బిడ్డలు దానివిషయ మాలోచించుచు నిద్రపోరు. తల్లితండ్రులాడు భాషణ ములు వినుచు ముదిగాయలవలె కొందఱుబిడ్డలు కంటిపై కునుకు వేయరు. ఒకప్పుడు రాత్రులందు మాతాపితలు దాంపత్యధర్మమును నిర్వర్తించుటజూచి క్షోభజెంది బిడ్డలు నిద్రపోకుండుటయుకద్దు. అంగులకే రెండుమూడేండ్లు పైబడిన బుడుతలను పితరులు తమరు పరుండుగదులయందు నిద్రబుచ్చరాదు. మగపిల్లల నాడుపిల్లల నొకేమంచముపై పరుండబెట్టుటవలన వారికి చిత్తవిభ్రమము తప్పక కల్గును. పెద్దలమగు మన మట్టియేర్పాట్లు చేయరాదు. బిడ్డలు శయ నించుట కనుదినము నిర్ణీతకాల మేర్పరుపవలయును.

మధ్యాహ్నకాలమునందు బిడ్డలకు కునుకు ముఖ్యావసరము.

---

## ౬

## బిడ్డలు: నవ్వు

బిడ్డలు నవ్వువిషయమున కష్టతమములగు నియమ ముల నేర్పరచుట శుభదాయకముకాదు. బిడ్డ లిట్టి విష యమున నొక్కటెన్నునబోవువారుకారు. వారి వయస్సును బట్టి హాస్యాస్పదములగు విషయములు గూడ మారుచుం డును. హాస్యయుక్తములగు విషయములతో నిండిన కథను పదేపదే వినుటకన్న బిడ్డలణుమాత్రము గూడ విసువు జెందరు. శ్రద్ధతో బిడ్డనిచర్యలను మనము పరిశీలించినచో నవ్వు అతనికి ప్రకృతిగుణముమాత్రమే కాదనియును, ఆతనియాట లేగితనమునకును హాసమునకు నవినాభావ సంబంధము కలదనియును నిర్ధారణచేసికొనుటకు వీలుం డును, శిశుహాసము సాధారణముగ దాని సహజగుణము

లపై నాధారపడియుండి కొంతకాలమైనపిదప నెట్టిమా ర్పును జెందదయ్యెను. స్వల్పములగు నాపదలయందు తగు ల్కొనిన వారినిగూర్చిన కథలు వినుటకు బిడ్డలుచెవికోసు కొందురు. అట్టికథయందు పుట్టకుక్కవలె బలసినవాని ప్రశంసజేసినపుడెల్ల బిడ్డలు పక్కలు చెక్కలగునట్టుల నవ్వెదరు. అదేపనిగ నవ్వినచో నుచ్ఛ్వాసమెక్కువై అట్టి వారి రక్తప్రసారము బాగుపడును. నవ్వు ఆహారమును జీర్ణించు విషయము చాలవఱకుఁ దోడ్పడుచున్నది. బిడ్డల వయస్సు వారియంతస్థునకును హాసమునకు నెంతయో సంబంధమున్నది. అనగా వారి యీడునుబట్టియు జన్మము ననుసరించియు వారియందు నవ్వొగుడుదిగుడుగ నుత్పన్న మగునని యర్థము. వింతవస్త్రములు, చిత్రవిచిత్రములగు రుతములు, అసంబద్ధములగు విషయములు, వికృతములగు నడకలును బిడ్డలను పకపక నవ్వునట్లొనర్చును. అందులకే శునకరవములు మొదలయినవి వారిని యుత్సాహపూరితు లనుగ జేయును వస్తుతః తెలివితేటలుగలవారు మాత్ర మే యెక్కువగ నవ్వెదరు.

జీవకోటులన్నింటియందును మానవు డొక్కడే నవ్వుచు నేడ్చుచునుండును. దానికి గతమేమియో యిం చుక యోచించితిరా? ప్రాణికోటిలో నాతఁడొక్కడు మాత్రమే విషయము లెట్లుండవలసినదియు తాము దుఃఖించునపుడు గాని చింతించునపుడుగాని యెట్లుండినది యు వివక్షింపగల్గియుండుటచేతనే మనకోర్కెలు కొన సాగకుండ నేది ప్రతిబంధకమగునో దానినిజూచి యేడ్చె దము. ఏది కొంచె మాశాభంగమునుగాని నష్టమునుగాని

గల్గించెనో దానిని జూచి నవ్వెదము. మనము బిడ్డలతో మాట్లాడునపు డప్పుడప్పుడు మాత్రమే హాస్యమునకు తావొసంగవలయును. హాస్యము సాధారణముగ మనుజుని యానందమునుమాత్రమే యావిష్కృత మొనర్చునని మననమ్మకము. నరుఁడుగాని వానరముగాని నవ్విన వెంటనే వారి నేత్రములనుండి ప్రత్యేకమైన కాంతి బయలుదేరుచున్నది. చక్కిలిగింత పెట్టినచో బిడ్డలెట్టుల నవ్వుచుండిరో యటులనే మర్కటములు సహితము హాసించును. చురుకైన బిడ్డలు చక్కిలిగింత పెట్టినచో రెండు మాసములవారయ్యును పకపక నవ్వెదరు కాని మందబుద్ధి గలవా రింకొక నెలకుగాని నవ్వరు. ఉడుపులు వేసికొనిన బిడ్డకంటె దిసమొలగలవానికే చక్కిలిగింత యెక్కువ.

బిడ్డనియందు స్మితము మూడవవారమునను హాసము మూడవమాసమునను నంకురించుచున్నది. వికలాంగులు స్థూలకాయులు స్వల్పనష్టమునకు గురియైన ధనికులు మొరటువారును కథలలో వచ్చినచో వారిప్రశంస వచ్చినపుడెల్ల పిల్లలు పక్కలు చెక్కలగునట్టుల నవ్వెదరు.

మాగ్డూగల్ గారు హాసమునకును స్మితమునకును సంబంధము లేదనియును కొంచెము ముదిరిన స్మితమే హాసముగ పరిణమించుననియును ననుట సయుక్తముగ లేదని నిరూపించియుండిరి. ప్రఘృణమునకు హాసము విరుగుడనియును నిరూపించియుండిరి.

### హాసము – స్వప్నములు

స్వప్నావస్థ కొంచె మించుమించుగ నున్మాదావస్థనుబోలియున్నది. ఉన్మాదికి ఆరోగ్యము కున్న. స్వప్నముగాంచెడువాడు

మాత్ర మున్మాదమును గోల్పోవుటలేదు. మనము నిద్రించుతరి మన ప్రక్కను ప్రొయ్యాయరచుటకు మొదలిడినచో నాయరుపు నే వెలుఁగుబంటి యరుపుగనో కలయందు గాంతుము. నిద్ర మేలు గాంచిన వెంటనే నిజస్థితిని తెలిసికొని మనము నవ్వుచుందుము. ఇట్టి స్వప్నానుభవములు స్మృతిపథమునకు వచ్చియే బిడ్డలును నవ్వుట. ఆరోగ్యవంతులగు శిశువులు స్వప్నముల గాంచు నెడ నరుదుగా మాత్రమే నవ్వెదరు. బిడ్డలుజేయు హాసము రెండు తెఱంగుల నొప్పారుచున్నది. శిశువు దానికిఁగల్గిన నిర్మలానందమును పట్టఁజాలక నవ్వవచ్చును లేదా వినోదకరములగు వస్తుజాలమును జూచి సంతసించియైనను నవ్వవచ్చును.

---

# ౭

# తల్లితండ్రులు మెలగవలసిన తీరు

బిడ్డనితో సంభాషించుటకు తల్లిదండ్రులను దినమును కొంతకాల మేర్పరచుకొనుటుచితము. బిడ్డని పల్కులన్నియు చెవియొగ్గి వినుచుండవలయును. అడుగనిదే వానికి సలహా నొసంగుట తెలివితక్కువతనమగును. కపటము, కల్లయును వీడి యున్నదున్నట్లు బిడ్డకు విప్పిచెప్పినచో వెంటనే యాతఁడు మనయందు విశ్వాసము గనుపరచును.

### ఏకపుత్రునిగోడు

ఏకపుత్రుని పోషణము కష్టమగుపని. వానిని ఉప్పలిమో ఊదరయోయని యంగలార్చు టభివృద్ధిదాయకము కాదు. వాన్నిని పితరులు పువ్వులలోఁబెట్టి పూజచేయుటవలన వాఁడసూయాపరుఁడు, స్వార్థపరుఁడు, అహం

కార్శి, పరాధీనుఁడు, కలహభోక్తయు, నధికారకాంక్షియు నగును. ఒకవేళ నేకాంతప్రియుఁడు, చపలచిత్తుఁడు, భ్రాంతుఁడు, లజ్జాపరుఁడు, కలుపుగోలుతనము లేనివాఁడును కావచ్చును.

తల్లిదండ్రులకు గారాబములపట్టియగుటవలన చనువుమఱిగి మేరినిదగ్గరకు చేరనీడు. ఎవ్వఁడో యొకఁడు తనకు సంగడిగాడున్నటుల భావించి వానితో మాటలాడ ప్రారంభించును. తల్లిదండ్రులు భయపడి గాలియో, ధూళియో యని తాయెత్తులు రక్షరేకులు కట్టింతురు. ఇదేటి వెఱ్ఱి?

ఏకపుత్రులలో కొందఱు చుక్క తెగిపడినట్టుల జయశీలురు తేటగలవారు కూడ నుందురు. వారికిఁదగిన పరిసరములు లేకున్నను గొప్పవంగడమునందు జనించుటొక్కటియే చాలును. అట్టివాఁడు సుక్షేత్రమునందలి బీజమువలె దినదినాభివృద్ధిగాంచును.

పిల్లవాఁడు చిన్నతనమున సంగడిగాండ్రు లేకున్నచో బెంగపెట్టుకొనునుగదా యని సందేహముగల పితరులు వాని పినతల్లి, పెదతల్లి బిడ్డలను దగ్గరకుఁదీసి వానితో 'జత' చేయవచ్చును. సన్నిహితులతోడనైనచో బిడ్డలు అతికిపోదురు. జ్యేష్ఠున కనుజు లనిన పడదు. అట్టివి మనమెన్నియో గాంచుచున్నాము గాని వానితత్త్వము మనకు బోధపడుటలేదు. రెండవబిడ్డ జనింపగనే పొట్టచెట్టునకు పొరుగు గిట్టని చందంబున నీబుడతఁడు చిన్నబుచ్చుకొనును. కొందఱు జ్యేష్ఠులు తమయారోగ్యమును గూడ గోల్పోవుచున్నారు. అది తల్లిదండ్రులకుఁ దెలియక

మాపాఁడు పాలనవత పడినాడనియును, ఏదియో సోకిన దనియును తలంతురు. ఎంత అమాయికత్వము!

బిడ్డలు ఒకటిరెండు వత్సరములు దాటువఱకును వికారస్వభావము నమితముగ గల్గియుందురు. వారలలో నహంకారముగూడ కరుఁడుగట్టి యుండును. మనము సాధారణముగ స్తన్యము గ్రోలుచున్న పిల్లవానిని గమనించినచో నాతఁడు తనకాలివ్రేళ్ళను మాటిమాటికి పట్టుకొనుట తల్లివంక తేఱిపాఱఁజూచుట జేయును. ఈకృత్యముల కర్థమేమో విచారించితిరా? అపుడే వానిలో నేను నాదియను భావ ముదయించుచున్నదన్నమాట. దీనికి పిమ్మట బిడ్డడు చుట్టుప్రక్కలవారిని గుర్తించును. వారిలో కొందఱిని ప్రేమించును. మఱికొందఱిని ద్వేషించును. నాదినాది యని మురియుచుండెడి తల్లిని నాదియనుటకు మొదలుపెట్టిన యనుజుని జ్యేష్ఠుఁ డెట్లు ప్రేమించును?

కాని యేకోదరులగుటవలన నపుడపుడు జ్యేష్ఠుఁ డనుజునియందు ప్రేమయును గనుపఱచును. మానవునియందు ప్రేమయును, ద్వేషమును కలగలుపుజెంది యుండును.

---

## ౩

# శిక్షణము

శిశు వీలోకమున నావిర్భవించినది మొదలు కొలదియో గొప్పయో లోకానుభవమును బడయుచునే యుండును. కాని యట్టియనుభవము స్పష్టమైనది కాజాలదు. పరిసరములందు గానవచ్చెడి బంధుజాలమెవ్వరో తనతల్లిదండ్రులకును తనకునుగల సంబంధమెద్దియో

వానికి తెలియక యిట్టిసంబంధముల నిజస్థితినిఁ దెలియుటకు చాల వఱకు యత్నించును. తదుపరి తనకండ్లయెదుట మరణించెడు శవ కాదు లేచటికేగునో వానికి తెలియదు. ఈరెండుకారణములును శిశువునందు జననమరణములకు సంబంధించిన జిజ్ఞాస జనింపఁజేయును. ఇదియే వాని మానసికలోకమునంతయు పాపభూయిష్టము గావించుచుండును.

ఉపరి బిడ్డఁ డాడువారికిని మగవారికినిగల భేదమెట్టిదో తెలియకుండుటవలనను తుదకు తనయవయవముల ధర్మములెవ్వియో తెలియకపోవుటచేతను దుర్మార్గమునకు గడంగుచున్నాడు. అభము శుభము తెలియని బిడ్డలకు దాంపత్యరహస్యముల బోధించుట యనుచితమని మీరనుకొనవచ్చును. బిడ్డడు పుట్టినప్పుడే కొంతవఱకు వానియందు కామముత్పన్నమగును. అది పిల్లవానియం దయిదవవత్సరము వఱకును పొడగట్టుచు నటుపిమ్మట హఠాత్తుగ నదృశ్యత గాంచుచున్నది. అట్టికామము మఱల యౌవనప్రాదుర్భావసమయమున వారియందు తలయెత్తుచున్నది. బిడ్డనియందంకురించుకామము జాతిప్రాచుర్యతయందు మానవుఁడుజూపు నుత్సుకతను సూచించును. దీనినిబట్టి బిడ్డడు పెరిగి పెద్దవాఁడై సత్సంతానమును బడయువఱకు నట్టికామము నరికట్టి వాఁడితరవిషయములందు తనచిత్తము లగ్నము కావించునట్టుల చూచుటయు, దాంపత్యరహస్యములన్నియు వానికి బోధించి చిత్తవిభ్రమము గల్గకుండునట్టుల జూచుబాధ్యతయు పితరులదై యున్నది. నూతనముగ తమయింట నొకబిడ్డ ప్రసవించగ నట్టియింటివారు, ఆతరుణమున పిండోత్పత్తి మొదలగు విషయములను తమపిల్లలకుఁ జెప్పవచ్చును.

కొందఱుబిడ్డలు కామోద్రేకమువలన పడరానిపాట్లు పడుచుందురు. అట్టివారు సాధారణముగ తమయనుజన్ములనుగాని యితరుల పసిగందులనుగాని పదేపదే ముద్దాడుచుందురు. తల్లిదండ్రుల విడిచిపెట్టి యుండలేక యెల్లపుడును వారికొంగే వీడరు. రాత్రులందు దుస్స్వప్నములగాంతురు. ప్రక్కలో నల్పాచమానము చేతురు. కొందఱు హస్తప్రయోగమునకు గడంగుదురు. హస్తప్ర

రోగము జేసెడి పిల్లలకు నుదయముననే కళ్ళుతిరుగును. ఇట్టిచిహ్నములను గుర్తెఱింగి వారిని మనము సదా సన్మార్గమును బట్టించుటకు యత్నింపవలయును. బిడ్డలకు వినోదము విశ్రాంతియు నెక్కువగ కల్పించియు, వారికి పరిశుభ్రమైన దుస్తులనొసంగియు, క్రమముగ స్నానము చేయించియు మనము బిడ్డలందలి దురభ్యాసములను ద్రుంచి వేయవచ్చును. వారియాహారాదులందు మార్పుదలజేసియు వదులగు నుడుపుల నొసంగియు వారి జననేంద్రియముల వైద్యునిచే పరీక్ష చేయించియు తగినంతనీరమును త్రాగుటకొసంగియు, చాలినంతనిద్ర పుచ్చియు వ్యర్థమగునలసట వారికి గల్గకుండజేసియు నీదురభ్యాసము నడచివేయవచ్చును.

---

## ౯

## పసిబిడ్డ భాష

“ఏకః శబ్దః సమ్యగధీతః సమ్యక్ ప్రయుక్తః
స్వర్గేలోకే కామధుగ్భవతి”

బిడ్డ చేటలోఁబడునపుడే యేడ్పు మొదలిడుచున్నది. ఆరోదనమే క్రమమున భాషగా పరిణమించును. కొన్ని దినములు గడిచిన పిమ్మటగూడ బిడ్డ మాటలాడలేదు. ఆకలియైనను, ఉయ్యాలలో పరుండుటచే ప్రక్కఒత్తుకొనినను, చీమలు మొదలైనవి కుట్టినను, కడుపులో కుట్టుచేసినను తదితరమగు శారీరకబాధ యొదవినను, బిడ్డయేడ్చును. కొందఱుతల్లులు శిశురోదనమునకు కారణమరయఁజాలక విసువుజెందుచున్నారు. ఈ యేడ్పు పోనుపోను, అ, ఉ, ఉంగా, యను వింతయగు శబ్దముగా

మాఱుచున్నది. ఈవర్ణములు భాషగా నెటుల పరిణమిం
చునో స్థాలీపులాకన్యాయముగా చర్చించు టుచితము.
ఇటుల నుచ్చరించుటకలవడిన శిశువు ఆఱుమాసములు
రాగానే తన పెదవులు, నాలుక, కంఠస్థములగు నాడీ
తంత్రులు మొదలగు వాగింద్రియముల కొంతవఱకుప
యోగపఱచు శక్తిని బడయును. వెంటనే వచ్చియురాని
మాటలు వదరును. వచ్చియురానిమాటలును, ఊరియు
నూరని యూరుగాయయు రుచికి ప్రశస్తములేగదా! అట్టి
తఱి శిశువు శబ్దములకంటెను సయిగ లెక్కువగాఁ
జేయును. వీనినే మనవారు విద్దెములందురు. ఈరీతిగా
శిశువు తనభావముల వ్యక్తపఱుచును, పెద్దవారీసైగల
నవగతముచేసికొని శిశునిర్దిష్టములగు కార్యముల నాచ
రింతురు. బిడ్డ 'బు, బు, బూ,' యని సయిగచేసిచూప
తల్లియు నది యర్థముచేసికొని యాహారమిడినచో శిశువా
సమయమునుండియు నన్నము కావలసినపుడు 'బు, బూ'
అనును. క్రమముగా నిదియే బువ్వయగును. ఈవిధమున
వస్తుసముదాయమునకు శిశువు నామకరణమిడుచుండును.
శిశువు అట్టి బుడిబుడినుడు లుచ్చరించునపుడు తల్లితండ్రు
లు సంతసించి వానిని ప్రోత్సహించినచో నింకను అమిత
ముగా కొన్నిశబ్దముల నోటఁబట్టును. ఇటులనే గ్రుడ్డి
వేటుగా మాటల నుచ్చరించి బిడ్డతుదకు భాష నలవఱు
చుకొనుట మీరు శ్రద్ధతో గమనించితిరా? అయినను
బుడుతలు రెండుమూడు వత్సరములు పైఁబడువఱకును
మాటల నోటబట్టుటయేలేదు. ఈశక్తి ముఖ్యముగా
బిడ్డని యారోగ్యము పుట్టువు, పోషణ మొదలగు విషయ

ష్ములపై నాధారపడియుండును. అన్నివిధములను సౌఖ్యము లనుభవించెడి బిడ్డలు త్వరితముగానే 'ఊకొట్టుచుందురు.'

ఈ ఘట్టముదాటగనే పిల్లలు పై అచ్చులను (ఉ, అ, ఉంగా) కలిపి 'తాత, అత్త, అమ్మ,' అని మొదలిడుదురు. బిడ్డలు ప్రయత్నపూర్వకముగా నట్టినుడుల పల్కుటలేదనియు నవి యదృచ్ఛాశబ్దము లనియును చదువరు లూహింతురుగాక! 'మర, మర' యనపదము నవిచ్ఛిన్నముగా నుచ్చరించిన 'రామ, రామ' యెట్లగునో యటులనే యీపదములు నేర్పడును. పిమ్మట శిశువు స్పష్టముగా 'పాప, పాప, అమ్మ, అమ్మ' యని పల్కును. అనగా బిడ్డని భాషకు మొదటియక్కరము లోష్ఠ్యములే (Labials) యని నిరభ్యంతరముగ చెప్పవచ్చును. ఆ వర్ణములే సులభములైనందున మునుకొని వానినే యుచ్చరించును. అదెట్లుపొసగునో యించుక విచారింపుడు. స్తన్యమును గ్రోలునపుడు పసిబిడ్డ పెదవులు, నాలుకయు నుపయోగింప నేర్చుకొనునుగదా! శబ్దోచ్చారణయందును నవియే వానికి తోడ్పడును. "అభ్యాసం కూసు విద్య" యగును. వానికి కొందఱు, శిశు వట్టి యవ్యక్తము లగు ధ్వనుల నుచ్చరించుట దాని నాడీసముదాయ మానసికమగు మార్పునకు లోనగుటవలనని యభిప్రాయపడిరి. అట్లయినచో మంచియనుభవముగల బిడ్డకు నాడీతంత్రులు బలిష్ఠములగుననియు అట్టి వాడుకలే వానికి త్వరితముగా మాటలువచ్చునట్లొనరించుననియు చెప్పుట అతిశయోక్తి కానేరదు. ఇవియునుకాక పితరుల మేధాశక్తిపై నట్టికృత్య మాధారపడియుండును. దీనినే ఆను

పోయితయుండును. ఇట్టి యస్పష్టములగు శబ్దముల యర్థమును ౧౧ మొదలు ౧౫ నెలలపిల్లలు కొంతవఱకు గ్రహింపఁగలుగుచుండిరి. అప్పటినుండియే బిడ్డలు, భాషకు సోపానము లేర్పఱచుట, ౧౫ మొదలు ౨౦ మాసముల బిడ్డ లీమాటలనే వాక్యములుగఁగూడ నుచ్చరింతురు.

భాషయును భావమును సంపృక్తములని కొందఱి మతము. భాషయే మానవుని భావపరంపర నభివృద్ధి నొందించుననుట నమ్మశక్యము కాదు. కుక్కలును, కోతులును భావములుఁగలిగియును భాషించుచున్నవా ? లేదే. వాయసము రెండుకంకులు మూడుకంకులకంటె తక్కువని తెలిసికొనఁగలదట. కాని రెండు అనెడు సంఖ్య మూటికంటె తక్కువయని యెఱుఁగదట. అటులనే బిడ్డలకును భావములు ప్రారంభదశయం దెగుడుదిగుడుగా నుండును. దీనినిబట్టి పసిగందు మాటలాడుటలేదే ! కనుక వానికి భావములుండవని వచించుట పొరపాటు. భాషను బిడ్డఁడు పరిసరములందుఁ దిరుగాడు పెద్దల ననుకరించి దృఢముగా నలవఱచుకొనును. బధిరులు మాటలాడలేక పోవు టెందులకో మీకు తెలియునా ? పుట్టుకతోడనే చెవిటియగువాడు పరిసరములందు చెల్లుబాటగు భాష వినజాలడుగదా ! అట్టివాఁ డనుకరించుటయు మిథ్యయే. అయిదారు సంవత్సరములైనతర్వాత చెవుడువచ్చిన బాలుఁడు తానిదివఱకు నేర్చుకొనిన రెండుముక్కలును ఇందులకే, గుంటపెట్టి గంటవాయించి సర్వకాలమును మూఁగవాఁడై యుండును. కాని పెద్దవాఁడయిన తర్వాత బధిరుఁడగువాని కిట్టిగతి పట్టుటలేదు.

ఇఁక బిడ్డవాక్యరచన మెటుల నొనరించుచున్నదో యించుక విచారింతము. పెద్దవారివలె పసిపాప కర్తకర్మ క్రియలుగలవాక్యముల గూర్చుటలేదు. పాలు కావలసినచో "అమ్మా, బా" యని యడుగును. బిడ్డ రెండున్నర లేక మూఁడు వత్సరములు వచ్చినతర్వాత వాక్యములను కొంచెము పిరికితనముతోడఁ బ్రారంభించును. వాని వాక్యములం దుపసర్గలు మొదలగు కొన్ని భాషాభాగములుండవు. శ్రోతయే వానినర్థముచేసికొనవలెను. కొందఱు బిడ్డలు "తాత, కాలె ; నాన్న లేవు" అని వచింతురు. మూఁడుసంవత్సరముల బుడుతలు "నీవు, నే" ననుమాటలెగుడుదిగుడుగా ప్రయోగింతురు. వారు సాధారణముగా "నేనెక్కడికి పోతావ్" "నీవు పోతానా?" యని వాక్రుచ్చుట మన యందఱికిని విదితమే.

పసిబిడ్డలు మాటలాడుభాష యనేకవిధములుగా నొప్పారుచున్నది. ప్రారంభదశయం దాతఁ డుచ్చరించెడి నుడులు వానికే తెలియునుగాని తదితరుల కవగతమగుట కష్టము. అతఁడు మాటల పదేపదే యుచ్చరించును. అట్టి పునరుక్తి యాతని కానందజనకమగును. కొంచె మెదిగిన బిడ్డ దానిలో నదియే మాటలాడుకొనును. మనవారు చెప్పినటుల తుమ్ముకొనుటయు, చిరంజీవ యనుటయుగూడ దానివంతే. ఎవ్వరిని యుద్దేశించిగాని భాషింపదు. ఒకప్పుడు సమవయస్కులగు బిడ్డలందఱునుగూడి గొఱ్ఱెల మందవలె యొకటే, ఎవ్వరికి తోచినటుల వా రఱతురు. అట్టివారిని మనమడ్డగించినచో వారు నిరుత్సాహు లగుదురు. కొంతకాలము బిడ్డను స్వేచ్ఛగా ప్రవర్తింపనీయ

వలెను. కొన్నిమాసములు పైఁబడినకొలదియు బిడ్డ చుట్టుఁబట్లవారితో సంభాషణ మొదలిడును. ప్రథమ మున నా కదికావలె నిది కావలెనని మారాము పెట్టును. పిమ్మట పరిసరములనుగూర్చి ప్రశ్నింప మొదలిడును. ప్రత్యు త్తరము వచ్చినను రాకుండినను తానే తనకుతోఁచినటుల సమర్థించుకొనును. కొంచె మెదిగినపిమ్మట దీని తత్వ మేమో చెప్పుమని పెద్దవారిని బాధించును.

మనము చెప్పునదంతయు బిడ్డ వినుచుండెనని తలంచి మోసపోవుచుంటిమి. బిడ్డ సాధారణముగా తానం తయు నర్థముచేసికొనినటుల నటించును. బిడ్డకుఁగూడ స్వాతిశయ మెక్కువగానే యున్నది. తన కర్థముకాలేదని చెప్పినచో తోటివారలు నవ్వెదరనిగాని, బడిపిల్లవాఁడయి నచో పంతులు కొట్టుననిగాని అంతయు తెలిసినటులనే నటించును. బిడ్డనికి తాము చెప్పిన విషయజాలము తెలిసి నదో లేదో కనుగొన నిచ్ఛగించువా రందఱును వానికి తా మొకకథ చెప్పి వానిచేత నాకథనే యింకొకబాలునికి చెప్పింపవలెను. అప్పుడు వానిగుట్టు బయటపడునుగదా! పది మొదలు ౧౫ సంవత్సరములపిల్లలకు "చెట్టై వంగనిది మానై వంగునా" యనునట్టి కొన్నిసామెతలను పదివఱ కును యిచ్చి ఒక్కొకసామెత వివరణ మింకొక కాగిత ముపై వ్రాసియిచ్చి దాని సాహాయ్యమున ప్రతిసామె తను కనుగొనుమనవలయును. ఈరీతిగా పిల్లవాఁ డర్థము చేసికొనినదియు లేనిదియును గుర్తింపనగును. విషయావ గాహన మొనరించునపుడు బిడ్డల స్వాంతాభిప్రాయము

లడ్డుపడును. అట్టి యభిప్రాయపరంపరప్రోద్బలమువలన బిడ్డ లపార్థమునూహించుట కెంతేని యవకాశముగలదు. విస్తరించుట కదను లేక సంక్షిప్తముగాఁ జెప్పఁదలంచితిని. బిడ్డ క్రొత్తవాక్యముల నెందుకర్థముచేసికొనదనగా క్రొత్తమాట లర్థముకాకనైనను కావచ్చును. లేక అట్టి వాక్యములందలి నూతనభావములను గుర్తింపలేకనైనను కావచ్చును. ఇదియునుగాక బిడ్డ పరాకుఁజెందియుండుట వలననైన నగును.

బిడ్డలు మూడుసంవత్సరములు పైఁబడగనే యిదెందు కదెందుకని యడుగు ప్రశ్నలతో చంపుకుతిందురు, తల్లి తండ్రులను. అందులో ముఖ్యముగా కొన్నిప్రశ్నల నిట పేర్కొనుట మంచిదని తలంతును. "అమ్మా! ఆచెట్టుకు ఆకులెందుకు" "ని వ్వెక్కడికి" "నేనెందుకు చదువుకోడం" "ఏట్లో నీళ్ళెందు కట్లాపోవడం"అని పృచ్ఛించును. కాని బిడ్డకు ౬, ౭ సంవత్సరములు రాగానే "పండుగెప్పుడు" "పెద్దవాళ్లు తప్పులుచేస్తారా?" "అమ్మా నేనుమంచివాణ్ణా? అమ్మాయి మంచిదా? చెప్పు." "మొగవాళ్లు పేరంటాని కెందుకెళ్ళరు చెప్పు చెప్పవేం" అని యొకటే కొట్టిపోయును. బిడ్డవేయు ప్రశ్నలకన్నిటికిని తల్లి దండ్రులుగాని పంతులుగాని వెంటనే ప్రత్యుత్తరమొసంగుట మంచిది. సాధ్యమైనంతవఱ కున్నదున్నటుల చెప్పుటే శ్రేయోదాయకము. అట్లయిననే బిడ్డ మనయందు విశ్వాసమునుఁజూపును.

బిడ్డ యుచ్చారణమునం దిసుమంత తప్పుజేసినను వెంటనే తల్లితండ్రులుగాని పంతులుగాని పెద్దవా రెవ్వ

ర్తైననుదిద్దవలెను. దిద్దుటయేగాక వారివారి శక్త్యాను సారముగా పిల్లలకు మాటలు వాక్యములుగూడ చెప్పు చుండుట శ్రేయోదాయకము. అట్లు చెప్పునప్పుడు వారి వారి యంతస్తులను గుర్తెఱింగియే భాష నేర్పవలెను : క్షేత్రమెఱింగి బీజము, పాత్రమెఱింగి దానమునన్నటుల. కొందఱు తల్లిదండ్రులు బిడ్డలకు భాష నలవఱచుచునే యుండిరి. అత్త తాత మొదలగు పదముల నేర్పి యాయా బందుగులగూడ నెఱుకపఱచుచునేయుండిరి. ఇదికాక యుచ్చారణయందు దక్షులుగా నొనర్చుటకు బిడ్డలచే పిత రులు "గంపలోని కందిపప్పు, గంపక్రింద పందికొక్కు" "వేకనూరినడిమి లంకనల్ల రెల్లుకట్ట" "నరిసీ ! యిరస పెసలువిసిరి యసరుమసలఁబెట్టవే!" "క్రిష్టాడిష్టిరిష్ట" మొదలయిన వాక్యముల నుచ్చరింపఁజేయుచునే యున్నా రట. కాని వారట్టి వాక్యములు సాంప్రదాయసిద్ధమైన వానిని కొన్నింటినేర్చి కూర్చి వారివారి వయసునకు తగిన రీతిని బిడ్డలకు నేర్పుట మంచిది. ఇదియునుగాక మనలో కొందఱు, బొడ్డూడని పసిగందులకు పద్దెములు నేర్పెదరు. మఱికొందఱు తండ్రులు తామే సక్కుబాయి నాటకము లోనో విని యానందించిన "స్వామి కరుణించెన్," అను పాటలను తాము కూనిరాగములుదీసి పిల్లలచే దీయిం తురు. ఇంకను కొందఱు "వందే శంభు ముమాపతిం" యని బిడ్డలకు నూఱిపోయుదురు. ఇట్టి కార్యము లుచితా నుచితముల నెఱింగి చేసిననేగాని ఫలింపదు. సాధారణ ముగా ౨ మొదలు ౧౦ సంవత్సరముల పిల్లలు వింత పద్దెములన్న ముచ్చటపడుదురు. ఒకప్పుడు కొందఱు బిడ్డ

లకు "నరసింహ కృష్ణరాయని కరమరుదుగ కీర్తికాంత కరిభిత్ గిరిభిత్త"ను పద్యమును వినుపింప వార లమందా నందమానసులైరి. కనుక వారివారి శక్తులను, అభిరుచులను గుర్తెఱింగి,నిరంతరదీక్షతో,నిత్యాభిరతితో పితరులు బిడ్డలను భాషాదక్షులుగా నొనరింతురని నామనవి.



## ౧౦
## పసిబిడ్డ అనుకరణము



అనుకరణాభిలాష సాధారణముగా నాలుగు నెలలైనతర్వాత నే శిశువు నావరించును. శిశువు సాధారణముగా తన తల్లిదండ్రులవలననే మెక్కువగా ననుకరించును. కనుక "అబ్బాయి; ఇది చేయు మది చేయకుమని" ఆన బెట్టుట నిరుపయోగము. బిడ్డలు సదభ్యాసముల నలవరచుకొనవలయునని పెనఁగులాడు పితరులుగూడ నభ్యాసముల పుంజితులై యుండుటకు సర్వథా యత్నించుట కడుంగడు శ్రేయస్కరమని సుస్పష్టమగుచున్నది.

కడుపులో మాడునపుడు బిడ్డనోటిలో నేదియో తినుబండారమును పెట్టుకొనుట యనుకరణము కానేరదు. కాని తనకు బుభుక్ష లేనపుడును తనకు రుచింపనిపదార్థములును, ఇతరులు తినగాఁజూచి తానును మెక్కుటకు యత్నించుట తప్పక యనుకరణమగును. తాను క్రొత్తగా వినిన ధ్వనిని మరల మరల జేయ యత్నించుటయు ననుకర

ణమేయగును. జంతువు లన్ని కృత్యముల ననుకరింపఁజాలవు. కోకిల సహజమధురమగు మాతృగానమునే యనుకరింపఁగలదుగాని తదితరరవముల ననుకరించెడిశక్తి దానియందు మృగ్యము. కాని బిడ్డఁడు తిర్యగాదులవలెనే గాక పరిసరముల నతికౌశల్యముతో ననుకరింపఁగలుగును. అట్టి శక్తియే అర్భకుఁడు వృద్ధికాముఁడని వేనోళ్ళచాటుచున్నది.

అనుకరణము బుడుతనియందు వైధర్మ్యమువహించుచున్నది. ఇది బిడ్డనికి మొదటి ఆరునెలలలోనే పరిచితమగును. ఆవలించుట నవ్వుట మొదలగు కార్యములనే ప్రత్యనుకరణమందుము. ఇతరులీకార్యములొనర్చుట పరిశీలించి వానినిబిడ్డ అనుకరించును గనుక దీనికి ప్రత్యనుకరణమని నామకరణము జేసితిమి. అయత్నకృతానుకరణమును మొదటినాలుగు వత్సరములలోనే బిడ్డడారంభించును. బిడ్డ తనపరిసరములను పరిశీలించుజ్ఞానము నిపుడు బడయును. అట్టి అనుకరణమును నిర్హేతుకముగనే శిశువారంభించుచున్నాడు. అట్లొనర్చుటలో వాని కెట్టియుద్దేశ్యమును లేదని స్పష్టముగా చెప్పవచ్చును. శిశువిపుడు కోడికూత, రైలుమోత మొదలగు ధ్వనుల ననుకరించుటయందత్యుత్సాహము జూపును. నాటకీయానుకరణమును పిమ్మట మొదలిడును. దీనికి పైదానితో సంబంధములేకపోలేదు. కాని యీ ఘట్టమున శిశువు తన భావపరంపరను బహుధా వ్యక్తపరచ నిచ్ఛగించును. తాను వినినట్టియు, చదివినట్టియు బిడ్డలగాని మానవులగాని తాను సాధారణముగా ననుకరింపఁ జూచును. స్వేచ్ఛానుకరమునే

అప్రేరితానుకరణమని పిలువవచ్చును. ఇట్టియెడ బాలుడన్యవస్తుప్రేరితుఁడై గాక లోలోన పొడసూపెడి తన కోర్కెలను కొనసాగించుటకై అనుకరించుటయే యిది యగును. ఇట్టితరి తాను కొంతవఱకు భాషనుగూడ నలవరచుకొనును. తనకువచ్చిన బుడిబుడినుడులతో తనవాంఛలను వ్యక్తపరచును. ఇది శిశువృద్ధికి ముఖ్యావసరము. తనలోతాను నవ్వుకొనుట మొదలగు కృత్యము లయత్నకృతానుకరణజనితములగును. కాని తానితరుల నవ్వించుట స్వేచ్ఛానుకరణమగును. ఆదర్శానుకరణమును గూడ బిడ్డడు వ్యర్థముగా నొనరించుటలేదు. ఇట్టికృత్యము నాచరించుటకుముందు శిశువు కొన్ని యాదర్శములనుగలిగి తత్సాధనకై పెనుగులాడుచు నట్టి యాదర్శములసాధించిన వారలవలెనే మెలఁగుటయే ఆదర్శసాధనానుకరణమగును. అయినప్పటికిని అనుకరణవైధర్మ్య మిదమిత్థమని చెప్పుటకు వీలుపడదు. దీనియంగము లొండొంటితో సంపృక్తములగుటవలన నట్టి విభజన మొనరించుట దుస్సాధ్యమగుచున్నది.

## ప్రత్యనుకరణము

ఏణ్ణర్థము పైఁబడువఱకును బిడ్డలు ప్రత్యనుకరణమును మాత్రమే యొనరింపగలుగుచుండిరి. పోనుపోను యిది తదితరభాగములతో మిశ్రితమైనను, మానవుని బొత్తిగా వీడిపోవుటలేదు. వానియందడగియే యుండును. బిడ్డలు దర్పణమువలెనే సర్వమును తమయందు ప్రతిబింబింపఁజేసెడి శక్తిగలవారనుట సువిదితమేగదా! నీవు వారల విషయమెట్లు మెలగెదవో నీయెడల వారు నటులనే మెలఁగెదరు. మానవుని వ్యక్తిత్వము, మనోభావములును, వాని మోము, కంఠధ్వని, వాని కృత్యములయందు సహితము పొడగట్టుచునేయుండును.

దానిని బిడ్డడుగూడ పొడగట్టుకొక్కిగలిగియేయున్నాడు. ఉదయమున నే యుపాధ్యాయుఁడు నిప్పులకుంపటివలె మోము పెట్టుకొనినచో బుడుతలును అట్టులనే చిఱ్ఱుబుస్సనుచుందురు. అతఁడు వారియెడ నాదరణజూపినచో వారును అతని నాదరింతురు.

## అయత్నకృతానుకరణము

ఇట్టిది సాధారణముగా సంవత్సరము పైఁబడిన బిడ్డలలో నంకురించును. ఇదియును మొదటిదియు సర్వదాసంప్రుక్తములే. ఇది సాధారణముగా కరచరణాద్యవయవ విక్షేపములవలనను ధ్వన్యనుకరణమువలనను గలుగుచున్నది. ఇట్టి అనుకరణము నిర్హేతుకమైనదని మన కిదివఱకే తెలియును. పసిబిడ్డలు సామాన్యముగా తమకు పరిచితములగు తిర్యగాదుల ననుకరింతురట! అందులకే కాబోలు, 1,2 సంవత్సరముల పిల్లవాఁడు "అంబా"అనుచుతా నావు బుజ్జాయినని చెప్పి తల్లిదండ్రుల సంతోషపరవశులను జేయుట. బిడ్డలు తాము వినిన ధ్వనులను చూచిన సైగలను, ఈరీతి ననుకరింతురు.

## నాటకీయానుకరణము

పైదానివలననే నాటకీయానుకరణమును బిడ్డడు, కమ్మచ్చులోనుండి బంగారుతీవెను కలాదుఁడు లాగినటుల లాగును. ఇదేబిడ్డని అభివృద్ధియొక్క వైధర్మ్యమును తెలుపుచున్నది. ఇట్టియెడ నర్భకుఁడు తాను వినిన కథలయొక్కగాని, చూచిన వస్తుప్రపంచము యొక్కగాని ప్రేరణవలన తాను కొంతవఱకు మనఃకల్పనము మొదలిడుచున్నాడు. తనయిల్లు తగులపడునటుల భావించి యేడ్వసాగును. తనయాటవస్తువుల నెవ్వరో దొంగిలించినటుల తలంచి నిర్విణ్ణుడగును. అదియేగాక ఆంధ్రభాగవతమున బాలకృష్ణుఁడు 'గోపాలకుఁడ నేను గోవులుమీ'రని యుపవ్యసించినటుల తాను కంచరవర్తకుఁడనని, వైద్యుఁడనని, ఉన్నతోద్యోగినిఅని పెద్దవారితో చెప్పకొనుచుండును. ఒకప్పుడు కొందరు పిల్లలు కుంకుమమ్మెడివారి చర్యనంతయు జాగరూకతతో పరిశీలించి వారివలెనే రాతి

మొఱయము తెచ్చి పొట్లములు కట్టి అమ్ముటకు మొదలిడిరి. బిడ్డలు పరిసరములందే యే విషయములు నేత్రపర్వమగునటుల గాంతురో వాని నన్నిటిని తా మనుకరింపఁజూతురు. కనుకనే పితరులు సామాన్య కుటుంబమునకు చెందినవారలయ్యు తా మున్నతోద్యోగులకు తరుచుగా నిజగృహములం దాతిథ్య మొసంగి వారలు పదేపదే తమ యిండ్లకువచ్చునటుల జూచినచో వారిసంపర్కమువలన బిడ్డలట్టి యుద్యోగుల ననుకరింప మొదలిడుదురు. అట్టి అనుకరణవాంఛయే వారిని వీడకుండునటుల జూచినచో వారలును పెరిగి పెద్దవారైన తర్వాత నున్నతోద్యోగముల బడయగలుగుదురు. పాఠశాలలయం దుపాధ్యాయులును బాలురభావము లుద్రిక్తములగునటుల జూచి యుక్తాయుక్తముల నెఱింగి వారినిట్టి యనుకరణము నభ్యసింపఁ జేసినచో తప్పక బాగుపడెదరు. నటనానురక్తి బిడ్డనికి మూడవయేటనే గలిగి జీవితకాలమంతయు వానిని వీడుటలేదు. నాలుగు మొదలు ఏడుసంవత్సరములు వచ్చెడివఱకును బిడ్డనియం దిది యుచ్ఛస్థితిని గాంచును. ఈకాలముననే బిడ్డ సాధారణముగా తనలో నొక సంగడిగాడో, కొందఱు స్నేహితులో భాషించునటులభావించి తన నటనాకౌశలమునంతయు జూపఁ మొదలిడును. ఇట్టి అభ్యాసమే యేకపుత్రులకును గలుగుచున్నది. కృష్ణాపత్రిక ముఖమున నిదివఱకే వివరించియుంటిని.

## స్వేచ్ఛానుకరణము

ఇది శిశువునందు రెండవసంవత్సరముననో మూడవ సంవత్సరముననో తలయెత్తుచున్నది. దీనిని పసిగందు యాదృచ్ఛికముగాగాక ఒకనిర్దిష్టోద్దేశ్యమును నెరవేర్చుటకే యొనరించును. నా కిదికావలెనని యడుగుటకు శిశువు మాటలాడవలెనుగదా! అట్టివాక్కు లర్థవంతములుగానిచో తత్ప్రయోగము నిరర్థకమగునని యాతఁ డెఱుంగును ఈస్థితియందు—పెద్ద లేవస్తువు నెటుల నుచ్ఛ

కింతురో అటులనే యాతఁడు నుచ్చరింపయత్నించును. అట్టి యత్నమును జేయుటకై పరిసరముల నాతఁ డతిసమర్థతతో ననుకరింపవలయునుగదా! పెద్దవా రొకకృత్యము నెటు లాచరించుచున్నారో శ్రద్ధతో పరిశీలించి అనగా ప్రత్యక్షనేతృచరిత మొనర్చుకొనియే బిడ్డసమర్థతతో నద్దాని ననుకరింపఁగలదు. స్వేచ్ఛానుకరణము శిశుబోధ కెంతయో తోడ్పడును. అందులకే మాతాపితరులు తా మొక పనిని ముందు చేసిచూపినచో శిశు వతినిపుణతతో వారల ననుకరించుటయేగాక తత్కార్యాచరణమునం దెంతయో విజయమునుగాంచుచున్నది. దీనినిబట్టి మన శ్రీరంగనీతులన్నియు నిష్ప్రయోజకములగునని సువ్యక్తమగుచున్నదిగదా! ఈరీతిగా కార్యాచరణమునం దాతని కభిరుచి గలిగించినచో తత్కార్యము సరిగాచేయ లేదను నెపమున వారలను మనము శిక్షింప నవసరముండదు.

### ఆదర్శసాధనానుకరణము

ఇది పై యంగముల వికృతియేనని చెప్పవచ్చును. సాధారణముగా 3 మొదలు ౪ వత్సరములురాగానే బిడ్డ లిట్టిచిహ్నముల నగపరతురు. ఒకప్పుడొక బిడ్డఁడు తానే నాయకమ్మకథలలోనో వినిన బుద్ధిమంతుడగు పిల్లవాని చర్య కచ్చెరువంది నాటగోలె తానును మేధావివలెనే మెలఁగఁజొచ్చెను. అయత్నకృతానుకరణము, బిడ్డని యాతఁడు జూచెడిదంతయు యుక్తాయుక్తవిచారణలేకయే అనుకరింపఁజేయును. కాని ఆదర్శసాధనానుకరణము మాత్రము తాను స్వేచ్ఛాదృష్టితో పరిశీలించి "భేష్" అని ఆదరించి మెచ్చుకొనిన కొంతమందివ్యక్తులను మాత్రమే

అనుకరింపఁజేయును. ఈ అనుకరణము బిడ్డనికి ౧౩ వత్స రములు వచ్చువఱకును ఉన్నదున్నట్లుజూచుటవలన వానికి మహత్తరమగు క్రమశిక్షగా పరిణమించుచున్నది. కాని బిడ్డనికి వ్యక్తత రాగానే తానుజూచి మెచ్చుకొనిన ప్రతి వ్యక్తిని అనుకరింపక, తా నట్టి లోకోత్తరుఁడైన మానవుని జీవితమునుండి కొన్నియాదర్శప్రాయములగు ఘట్టములను మాత్రము మనమునం దుంచుకొని వాని సాహాయ్యమున తనజీవితమున జీవితమునకు మార్గదర్శకములగు కొన్నినిబంధనలను నిర్మించుకొని సాధ్యమైనంతవఱకు వాని నాచరణయందు బెట్టనుంకించును— సత్యాన్వేషణపరులగు తల్లులుతండ్రులు దీనియాథార్థ్యతను తెలిసికొని తమ బుడుతల భావిజీవితనిర్వహణమునందు దక్షులనుగా నొనరింతు గాక !

---

## ౧౧

## పసిబిడ్డ—ఆట

ఆట బిడ్డని క్రమశిక్షయందు బెట్టుననుట నిర్వివాదాంశము. వారు మనెడి ప్రపంచమునందలి రహస్యము లన్నిటిని యాటయే బిడ్డలకు వ్యక్తపరచును. తమపితరుల యొక్కయు, పరిసరములందు వసించెడి యితర మానవుల యొక్కయు దైనికజీవనము ననుకరించియే బిడ్డలు ఆట లాడుచుందురు. పరిసరములు నీతిబాహ్యతకు పేర్గాంచి నచో బిడ్డ దుస్స్వభావమును బడయును. సంసర్గమువలన

దోషగుణములు గలుగుట సహజమేగదా ! బిడ్డల కీరీతిగా సంక్రమించిన దురభ్యాసములను వారు వయోవృద్ధులయ్యును వీడలేరు. దీని మహిమను యాధునికకిండర్గార్టెనర్లు (Kindergartners) బాగుగా నవగత మొనరించుకొనిరి. కనుకనే పాఠశాలలందు బిడ్డ లాడుకొనుటకు తగిన సాధనసామగ్రినంతెయు సేకరించి వారలక్రీడాపరాయణత్వమునకు దోహదమొసంగుట. అయినను భారతదేశమందు విద్యాలయము లట్టి సామగ్రిని యుచితరీతి నుపయోగపరచుట లేదనుట ప్రమాదముగానేరదు. నిజగృహములందు బొమ్మలపెండ్లిండ్లు మొదలైనవిచేయ నిచ్ఛగించు బుడుతలకు తగుసామగ్రి నొసంగ తల్లిదండ్రులు వెనుకంజ వేయరాదు. అటుల నాటలు మరుగుటవలన బిడ్డలు తమ పితరులాచరించెడి యవినీతికరములగు కృత్యముల శ్రద్ధతో పరిశీలించుట కవకాశములేక యట్టి దురభ్యాసముల నలవరచుకొనకుందురుగదా!

బిడ్డలు సామాన్యముగా నీళ్ళనినచో పడిచత్తురు. దానికి కారణమేమో మీర లూహించితిరా?మన యనాది పురుషుఁడు వేలకొలఁది వత్సరములక్రిందట జలముచే నావరింపఁబడెనుగదా ! అపు డాతనికి జలమునెడ చెలిమిగలిగినది. అట్టిమైత్రినే శిశువుగూడ ననువృత్తసిద్ధాన్తము ననుసరించి యుదకమునకుఁ జూపుచున్నాడు, కొందఱు శిశువులశుద్ధము పిసుకుచున్నారు. వారట్టి దురభ్యాసమునకు లోనుగాకుండునట్లుండవలె ననినచో పితరులు కొంత బంకమట్టిని పాకముచేసి దానిలో కొంచెము పసుపువైచి దానిదగ్గర బిడ్డను విడచుట శ్రేయోదాయకము. ఇందు

వలన బిడ్డ డశుద్ధముజోలికి పోడు; బంకమట్టితోడనే త్రేవు లాడును; దుర్గంధపుబాధయు నుండదు.

తన బంధువులయందలి యనురాగము నికముందు గనుపరచునను సూచనయే తాను సాలభంజకములం దమి తాదరము శిశువుగనుపరచుట యగును. పాఠశాలలందు శ్రద్ధతో శిశువయస్సును పురస్కరించుకొని వారివారికి తగు ఆటలందు బిడ్డలను దింపుట యుత్తమము. బిడ్డలు ప్రథమమున కాగితపు చొక్కాయిలు, లాగులు బొమ్మ లకు చేయుట నేర్చుకొనిన పిమ్మట గుడ్డకత్తిరించి లాగులు మొదలయినవి తమయాట బొమ్మలకు కూర్చుట యుపా ధ్యాయాదులు నేర్పుటమంచిది. అటుపిమ్మట బొమ్మరిండ్లు నిర్మించుటెట్టులనో బుడుతలకు చూపవలెను. తరువాత బొమ్మలకు గుండీలుపెట్టుట మొదలగు కార్యములందు వారలను సమర్థులనుగాఁజేయవలెను. మన తెలుఁగుబిడ్డలు తాటికాయ డొక్కలతో బండ్లుకట్టి వానిని లాగుటయు నాటయే; అదియును పరిసరముల ననుసరించుటయేగదా! రుక్మిణీదేవి "పేర్వేరబొమ్మల పెండ్లిండ్లుజేయుచు యబ లలతోడ వియ్యంబులందు"టయును పరిసరముల ప్రోద్బల మువలననే. నేటి జనపదములందలి బాలికలు వెలగ డొక్కలందు, చింతగుల్లలందు నన్నమువండుటయు నందు లకే. ఇట్టి కృత్యముల వారి కలవరచుటవలన భావిజీవిత మునందు తమకు కావలసిన యలంకరణాదులను వారలే వేసికొనగలుగుదురు. ఇటులనే క్రమముగా భవిష్యజ్జీవన మునందు తామెదుర్కొనవలసిన ఘట్టముల సోపానముల నర్భకు లెక్కుచుందురు.

ఆడుపిల్లలయాట లెవ్వియో, మగబిడ్డలయాట లెవ్వియో మొదట శిశువులెఱుఁగరు. పితరులు కాలక్రమమున నెవ్వరియాటలయందు వారి కభిరుచి గలుగు నటులఁజేయుట మంచిది. నేను మంత్రిని నేను రాజునని పిల్లలాడుదురు. ఇదియు ననుకరణమే యగును.

## ఆట—దాని నిర్వచనము

శరీరమునందలి యధికశక్తిని పలుతెఱఁగుల వ్యక్తపరచుటయే యాట. ఇది బిడ్డనికి సహజము. మృగశాబకములు సహితము చెలగాటమాడుటలేదా! ఈ చెలగాటమే పోనుపోను అట్టి జంతువుల కాహారసంపాదనమునకును శత్రువులనుండి తప్పించుకొనుటకును వివిధశక్తులను బ్రసాదించును. అక్కఱయు, నాటయును ఈ రెండు మాత్రమే శిశువును వస్తుతత్వము నెఱుంగునట్లొనరించుచున్నవి. కనుక యాహారాదులు సేకరింప నగత్యములేని కుటుంబములందు జనించిన బిడ్డలకు బ్రపంచజ్ఞానము శూన్యమగును. అట్టివారికి ఆటయే శరణ్యము.

కొందరు శాస్త్రజ్ఞులు, బిడ్డలు విశ్రాంతియు నుల్లాసమును కాంక్షించియే ఆటయందాశక్తి గనుపరతురని నుడివిరి. ఇది పొరపాటు. వీరు నిజమైన విశ్రాంతినే గోరినట్లయిన నిద్రాసుఖ మిసుమంత కాల మనుభవించి మేల్కాంచి మఱల జాగ్రత్ప్రపంచమున చురుకుదనముతో బ్రవర్తించియే యుందరు గదా!

వృత్తిరాహిత్యమువలన బిడ్డలు తమశక్తిని వినియోగపరచుటకు దారియు తెన్నునుగానక బాలక్రీడలందు సంలగ్నమానసు లగుచుండిరని కొందఱియూహ. అట్లయినచో వారు బుద్ధి పూర్వకముగా కాంక్షించెడిపనియందు (ఆటయందు) గూడ విరక్తతగిలిగి అలసిసొలసి తోటకూరకాడవలె వెలగల పడుటలేదా! ఆటయు నొకవిధమగు వ్యాపారమేయగును. మనవారు "చిన్నచిన్న చేతుల యీచెంబు అటుపెట్టుచూదా" మని పసిబిడ్డలయాటనుగూడ సాధ్య

మయినంతవఱకు నిర్దిష్టకృత్యములకే వినియోగపరచుచుండిరి గదా! అది మంచిదే.

పరిణామవాదులు కొందఱు బిడ్డలాడునపుడు తమతమ పూర్వికుల వృత్తుల నభ్యసింతురని వాదించుచుండిరి. కాని పసిగందులు పరిసరముల ననుకరించుటయే పరిణామవాదు లట్టి అపార్థముల గల్పించి సమర్థించుచుండిరనుట సమంజసమగు నేమో.

పూర్వికులవలె మెలఁగుటవలన బిడ్డలు తమ భావిజీవితమునం దుపకరించెడి విషయముల గ్రహింపఁ గలుగుదురనియు, చిన్నపుడు కయ్యమునకు కాలుద్రవ్వు స్వభావముగల బిడ్డలు పెద్దవారయిన తర్వాత పరమసాధులగుట లేదాయనియు పైవారిమతము. కాని ఆటయే వారిని నాగరికులనుగా తయారుజేయుననుట విశ్వసింప దగదు. సద్విద్యయుఁ శిక్షాస్మృతియును మాత్రమే వారల సాధులనుగా జేయునని మన మెందులకు తలంపరాదు.

ఆట శిశువులకు తమభావిజీవనమున నమితప్రయోజనకరములగు శక్తులను ప్రసాదించుననుట అత్యుక్తియగును. బాలక్రీడలు వారికి పెద్దవారి వృత్తులయం దభిరుచులను మాత్రమే కల్పించును. కాని తన్నిర్వహణమునందు వారికి చేదోడు వాదోడు కానేరవు. కాని మార్జారశాబకము మొదలగు మెకముల కాట యతీతమగు సహాయకారియే యగును. అదియే వానికి తన యాహారాదుల నెటుల సంపాదించుకొనవలయునో నేర్పును. అదియే బిడ్డని జ్ఞానేంద్రియములగూడ సంస్కరించుచున్నది.

బిడ్డలు తమ యిష్టమువచ్చినటుల మెలఁగుటయే యాట యగును. కాని నిర్దిష్టఫలితమును బడయుటకు జేయునదంతయు పనియే గాని యాట కానేరదు. పనిని శరీరమునందలి ప్రత్యేకావయవముల పలుమారు లుపయోగించి యలఁత జెందునటులఁ జేయుచుంటిమి. కాని యాటలాడునపుడు మాత్ర మట్టియవయవముల వెంటవెంటనే మార్చుచుందుము.

ఆట శిశువునకు సహజధర్మమైనను ప్రత్యేక కృత్య

ములనాచరించు టెటులనో యాతఁడెఱుంగవలెను. బిడ్డ లాటలాడునపుడు నిబంధనల సరకు జేయరు. అట్టి తరుణమున వారికి తగినంత స్వేచ్ఛనొసంగుట మంచిది. పంచ వత్సరములవఱకును బిడ్డడాట లేగితనముగా నుండును. ౫ మొదలు పది సంవత్సరములవఱకును Games అన వానికిష్టము. ద్వాదశవత్సరములకు పైన Games ను Sports ను కలగలుపు జెందును. వయస్సుముదిరినకొలఁదియు నాటగాడు తన స్వేచ్ఛను గోల్పోయి నిబంధనలకు దాసుఁడగును. ఆటయును, పారితోషికాదుల బడయుట కాదునపుడుగాని నిర్బంధవిధానమున నాడునపుడుగాని పనిగానే పరిగణింపఁబడును, క్రీడాంగణమునందే బిడ్డడు ధర్మశాస్త్రప్రయోజనమును గుర్తించును.

నాల్గవమాసముననే బిడ్డడాట మొదలిడును. ౨ లేక 3 సంవత్సరముల వఱకును బిడ్డనికాట శారీరము జ్ఞానసంబంధమునగు నభివృద్ధినొసంగును. ఈ కాలముననే శిశు వమితముగా నభివృద్ధిగాంచును.

బిడ్డ మూడవసంవత్సరమున తనపరిసరముల నను కరింప ప్రారంభించును. శబ్దజాలమును పదేపదే యుచ్ఛరించును. వానిహావభావముల బహువిధముల వ్యక్తపరచ మొదలిడును. భావనాప్రపంచము బహుళమగును. ఈ భావన ౫, ౬ సంవత్సరములు పైఁబడగనే యుత్కృష్టతను గాంచును. కాని యిది ప్రాయము వచ్చు వఱకును క్రమక్రమముగా కృశించుచుండును.

ఆటయందు శిశువు తన మూడవవత్సరమున జిజ్ఞాస బాగుగా వ్యక్తపరచుచు మిగ్గుల నుద్రిక్తుడగును. ౭ మొ

దలు ౧౨ వఱకును బిడ్డలాటయం దహమహమిక కను
పరతురు.

ప్రకృతిలో నణఁగిమణఁగిపోవు బిడ్డలు తల్లితండ్రు లెంత యాన పెట్టినను వారి పరోక్షమున హానికరములగు వస్తువులను తాకి వాని నిజస్థితిని గ్రహింపఁగలుగుచుండిరి. విద్యావిషయకములగు నాటలబిడ్డల కేర్పాటుచేయునపు డుపాధ్యాయులు వారి కండరములకు, భావనాశక్తులకు ధారణాశక్తికి శబలతనిచ్చువానిని మనస్సునం దుంచు కొనుటమేలు. ఉచితములని మనకు తోఁచిన సలహాల నిచ్చుట మంచిది గాని, యీయాట మంచిది యాయాట మంచిదికాదని శిశువులను విమర్శించి నిరుత్సాహులనుగాఁ జేయరాదు. కొన్ని కథలను వారిచేత నాటకము లాడిం చుటయు మంచిదే. వారి యాటవస్తువులను గురించిన కథలను చెప్పుట మంచిది.

౧౪ సంవత్సరముల బిడ్డలకు సమిష్టిక్రీడలయం దిష్టము. అట్టిక్రీడలవలన వారి నడవడిగూడ విశేషముగా చక్కఁబడును. మనయాంధ్రదేశమునందు బుడుతలాడు కొనెడియాట లెన్నియోగలవు. వానినిగూర్చి పత్రికాంత రము లిదివఱకే వివరములు ప్రకటించి నాభారమును తగ్గించినవి. బాలురయు బాలికలయు, నాటలను విస్పష్ట ముగా తెలిసికొని వారివారి వయస్సునకుతగిన యాట పాటలతో ప్రొద్దుబుచ్చునటుల తల్లిదండ్రులు జూతురని నాకోరిక.

---

# ౧౨

# పసిబిడ్డ - భయము



మనలో కొందఱు పసిబిడ్డ పాడీకుండ అన్నారనుచు బిడ్డలను గుడికదిలి వెలుపలికి రానీరు ఇది పొరపాటు. పిల్లలు స్వేచ్ఛగా తిరిగినచో మంచి వ్యక్తిత్వమునుగలిగి భవిష్యజ్జీవనమునందు ప్రయోజకు లగుదురు. అట్లుకానిచో కూపస్థమండూకములై తెలివిలేని వారై బాహ్యప్రపంచవిషయముల నించుకేనియు తెలియక అజ్ఞానాంధకారమున దేవులాడెదరు. ఇదికాక పిట్టబుఱ్ఱనినచో బెదరెడు స్వభావము గలిగెడు వారయ్యెదరు. భయము బిడ్డని కవసరమా కాదాయను విషయమును కొంతవఱకు చర్చించు టుచితము.

బిడ్డనికి భయముండవలసినదే. కనుకనే మనవారు 'భయమూ లేదు, భక్తీ లేదు. వీడు పనికిమాలినవాడగుచున్నా'డని నుడివెదరు. ఆంగ్లభాషయందుగూడ "Spare the rod and spoil the child." అనెడు లోకోక్తి ననుసరించి "అబ్బాయీ! సరిగా చదువకపోతే బెత్తంపప్పులు తగులు"నని యదలించుచున్నారీనాటి యుపాధ్యాయులు కొందఱు. అది మిగుల పొరపాటు. బిడ్డనినలిపి నైవేద్యముపెట్టినచో నాతఁడు దాసానదాసుఁడుగా తయారగును. కొంతవఱకు యుక్తాయుక్తముల గుర్తెఱింగి కంటిభయముతో బిడ్డను పెంచు టుచితము.

మఱికొందఱు బిడ్డలకు భయమనిన యెట్టిదో తెలియగూడదను సిద్ధాంతమును బయలుదేరదీసి పసిగందుల నోట మట్టికొట్టుచున్నారు. కాని నిజముగా భయమనునది శిశువు నభివృద్ధికిఁదెచ్చెడు ముఖ్యసాధనము, అపాయకరములగు కార్యములనుండి మనల పరాఙ్ముఖులనుజేయునది భయమేగదా! అట్టి భయమన నెట్టిదియో తెలియ నిది నిరతదుఃఖాపాదియగు మాయలోకమున నెగ్గఁగలమా?

క్రవ్యాదులు కొంతవఱకు భయమువీడి స్వేచ్ఛాప్రచారము గావించినచో శీఘ్రముగా మట్టుపెట్టబడును? పిల్లితో నెలుక చెలిగాటలాడునా? ఇది స్వభావవిరుద్ధము. భయమువలననే యది యట్లొనరించుచున్నది. బిడ్డలను భయమెట్టిదియో యెఱుంగనిపక్షమున— తామీ ప్రపంచమందు క్లిష్టపరిస్థితుల నెదుర్కొనవలసినపుడు, చేతకాని "దద్దమ్మ" లగుదురు. కాని భయమనునది శిశువును హఠాత్తుగా నావరింపగూడదు. ఆట్లావరించినయెడల నా పసిపాప యుక్కిరిబిక్కిరగును. సమయాసమయములఁ దల్లియొద్ద కూర్చుండఁబెట్టి మేపి పంచవత్సరములు రాగనే పిల్లవానిని "అబ్బాయీ బళ్ళోకిపో, నాయనా! అక్షరాభ్యాస మయివదిగదా" యని శ్రీరంగనీతులు చెప్పినచో బిడ్డవినునా? బడికిపోవుట అనినచో నది జగత్ప్రళయమనుకొని కుములును. మనవారు చెట్టైవంగనిది మానై వంగునా యనుట కిదియే తార్కాణము. గ్రాహకము తెలిసినప్పటినుండియు బడియననేమో యచ్చటి పరిస్థితులేమో తెలుపక పొరుగింటిపిల్లలతోడనైన, గిల్లి కజ్జములు తెత్తురను భయముతో, నాడుకొననీక ఆకస్మికముగా బడిలోనికి పొమ్మంటే పోతా డాకుఱ్ఱవాడు - మసులుతాడు గాని.

## భయము : దానివైధర్మ్యము

భయమనున దెన్నివిధములో కొంచెము చూతము. మృగములెప్పుడును చచ్చిపోదుమను భయముతో మెలఁగుచుండును. అట్టి భయమే మానవునియందునుఁగలదు. ఇది సాధారణముగా బాధననుభవించుటవలన జనించును. పాలు దొంగతనముగా త్రాగ నలవాటుపడు పిల్లి యొకనాడు సళసళ కాచినపాలలో మూతిఁబెట్టినచో నిక నది బ్రతికియున్నంతకాలము పాలజోలికి పోదు. అటులనే యెప్పుడును బాకుతో నాటలాడుకొనుబిడ్డ డొకప్పుడు వ్రేలు కోసికొనినచో నిక దానిని ముట్టుకొనుటకుగూడ జంకును. శారీరకబాధ మానవుఁడెప్పుడో యొకప్పు డనుభవింపవలసినదే కనుక చిన్నతనముననే యట్టిబాధ ననుభవింపఁజేయుట సమంజసము. మనదేశములో పిల్లలకు కర్ణవేధనము మొదలగు బాధ కలుగుచునే

య్యున్నది. కాని "టీకాలు వేయించండయ్యా" అంటే కొందఱు తల్లిదండ్రులు "మాబిడ్డ నల్లారుముద్దుగా పెంచినాము; నీచేతి కప్పగింతుమా" యని యెదురు తిరుగుదురు. తుద కెప్పుడో యొకప్పుడు మిత్తి కప్పగించుచునే యున్నారే!

పితరులిటుల ప్రవర్తించుట బుడుతలకు విషముగా పరిణమించుచున్నది. అటుల చాలమంది పిల్లల కొకపర్యాయము టీకాలు వేయునప్పుడు వారిని మీలో నొప్పిని యెవ్వ రోర్చుకొనెదరో చూచెదమని ప్రోత్సాహము చేయుచుండవలెను. వార లది విని నాకు నొప్పిలేదు నాకు నొప్పిలేదని యొకరినిమించి యింకొకరు పో నభిలషింతురు. పదిమందితోడి చావు పెండ్లితో సమానమని పెద్దలు వచించియేయున్నారుగదా! ఈతీరున చిన్నతనమునందు నొప్పి ననుభవించినబిడ్డ తన జీవితములో నట్టిఘట్టమునే తా ననుభవింప వలసి వచ్చినపుడు నగుమోముతో నిలుచుండునేగాని పిరికితనము చిన్న మెత్తైనఁజూపదు. అందువలన దానికి నాత్మవిశ్వాస మెక్కువగును.

మనకు తెలియనిదాని విషయమై భయముఁజూపుట సహజమే. వన్యమృగము లట్టిభయమునేఁ జూపుచుండును. "ఏమో పులేయున్నదో భూతమేయున్నదో దానిలోనికి పోవలదని" మనము సాధారణముగా జెప్పుచుండుటయే పిల్లలను జెరుచుచున్నది. అందులకే కొందఱు పిల్లలు పట్టణమందు దారితప్పి వారి తల్లిదండ్రులను గానక రోదన మొనర్చుచున్నారు. మరికొందఱు సాహసికులు తమదారి నెటులనో కనుగొని వారి తల్లిఁదండ్రులను జేరుచున్నారు. బిడ్డలు సాహసకృత్యము లాచరించునటుల వారిని ప్రోత్సహించుట పితరులమగు మనవిధియై యున్నది.

మూడవది పట్టుపడెదమను భయము. మానవుడు తెలివితేటలలో నారితేరిన కొలదియు నీభయ మెక్కువగా కలుగును. కనుకనే కొందఱు స్వేచ్ఛగా బహిఃప్రదేశములందు రాత్రికాలమున సంచరింప భయపడెదరు. ఆకారణముచేతనే కొందఱు రాత్రులయం

దింటిలో పడుకొన నిచ్చగింపరు. రాత్రులం దెవ్వరేని తలుపు గొళ్లెము బెట్టి కొంపకు నిప్పంటింతురేమో యనెడు భయము వారిని పీడించుచున్నది. బిడ్డలను యింటిలో మూలలకువెళ్ళి యేవస్తువు నైన తీసికొని రమ్మనినచో వారు వెనుదీయుట మనకు సువిదితమే. అట్టిభయము బిడ్డని ఆవేశింపకుండునటుల మనము తగుశ్రద్ధ వహింప వలెను.

నాల్గవది తోటివారలు తమవర్తనమున కేమను కొనెదరో యనెడు భయము. ఇది మనభారతదేశమువంటి దేశమందే తాండవ మాడుచున్నది. మానవుఁడెల్లపుడును తోటివారల పెట్టుపోతల కాశింపకపోయినను వారితో కలిసిమెలిసి తిరిగెడి స్వభావము కలవాఁడైయున్నాడు. కనుక సంఘమున కాతఁడు సర్వకాల సర్వావస్థలయందును వెఱచుచునేయుండును. ఈ వెఱపేలేనిచో వానికి పట్టపగ్గములేయుండవు. బిడ్డను తనసంగడిగాండ్రలో నెవ్వరేని గేలిచేసినచో "చూడవే అమ్మా! వాడు నన్నెక్కిరిస్తున్నాడ"ని తల్లితో మొఱపెట్టుట మనకు తెలిసినవిషయమే. కాని వాని మేధాశక్తి పరిపక్వదశనుపొందగనే యట్టి వేళన కాతఁడు పెడచెవిపెట్టి "ఏనుగుపోవుచున్న కుక్కలెన్ని మొరుగ"వని నుడువ మొదలిడును. స్త్రీలు శరీరము నలంకరించుకొను విషయమునను, వస్త్రధారణమునందునను తోటివారల యభిరుచి ననుసరించియే సంచరించుట ఈభయమువల్లనే.

అయిదవది యొంటరితనమువలని జనించెడిభయము పిల్లల నింటిలో నొంటరిగా వదలిపెట్టినచో నావురుమని యేడ్చెదరు. పెద్దవారుకూడ నొక్కరేయున్నపుడు బిక్కుబిక్కుమనుచునే యుందురు. ఇది మానవునికి స్వాభావికమే.

ఇదికాక చీఁకటియనినచో బిడ్డలు భయపడుదురు. ఆ భయమే పెద్దవారైనను వారిని వీడదు. ఈచీఁకటి భయ మెందు వలనఁ గలుగుననగా, బిడ్డని పెద్దవారు "నాన్నా చీఁకటిలోకి పోవద్దు బూచియున్న" దని యొకటే భయపెట్టెదరు. బూచి యను

న్నదో లేదో శిశువు విలోకించెనా? ఎఱుఁగువా? లేదు. నిజముగా బూచియేయున్నది కాఁబోలునని వాడుపొద్దుగ్రుంకగనే యింటిలోని కాలు బయటపెట్టడు. ఇదికాక మనము పిల్లలకు దయ్యములు మొదలైనకథలు చెప్పుచున్నాము కనుక చిన్నవాండ్ర చీఁకటిలో, గాలి దయ్యములు పెనుభూతములు భేతాళుఁడు వగయిరాలు చెలరేగి తిరుగునని శంకించి యింటిలో నడగిమడగిపోవుదురు. కొందఱు మానసికతత్త్వవేత్తలు మనపూర్వికు లెప్పుడో గుహలో నివసించిరనియు వారు చీకటిలో ఘాతుకమృగమువలన బాధపడిరనియును దానివలన వారలు చీఁకటియనినచో కలఁతజెందిరనియు అట్టి శంకయే వారిసంతతివారలమగు మనలఁగూడ బాధించుచున్నదనియు తలంచుచున్నారు.

కొందఱు తల్లిదండ్రులు ప్రతిదానికి భయపడెదరు. అట్టి భయమే వారినన్నివిధముల ననుకరించుచున్న వారి సంతానమును గూడ పట్టి పీడించును. ధ్వనియనినచోఁగూడ కొందఱు భయము పడెదరు. కనుకనే పెళపెళ యురుములు మొదలుపెట్టగనే మనలో కొందఱు "అర్జున, భర్జన" యని యరచుచున్నారు.

ఆరవది మతబోధవలన బిడ్డలకు కలిగెడిభయము. ఇట్టి భయమునకు మనము తావొసంగనేకూడదు. పాపము చేయఁగూడదనియు అట్లు చేసినచో నరకమున భగవంతుఁడు మనల వేపుకతినుననియు, యమదూతలు యినుపముక్కులు నీలిగుడ్డలు వంకకొప్పులు గలవారనియును మనము చెప్పుకొనుట బిడ్డలు విని బైరాగులు మొదలగువారినిఁజూచి భయపడుదురు. కొందఱుబిడ్డలు బిచ్చగాని జోలెఁజూచి నిలువుగుండెపడి ఏడ్పు మొదలు పెట్టెదరు. దానికి హేతువు మన తెలివితక్కువతనమే. మనము "నాయనా! అల్లరి చెయ్యవద్దు, కదలితే బూచివాడు సంచిలోవేసుకొని పోతా" డని చెప్పుదుము. ఆభయమే వేరుపురుగై పిల్లవానిని బాధించుచున్నది. అటుల భయంపడినపిల్లలకు బిచ్చగాని సంచితీసి యొకమారు చూపినచో నాభయముపోయి "ఓస్, ఇంతేగా" అని బిడ్డ చిందులు వేయ ప్రారంభించును. పిల్లివలని భయముగూడ నిటులనే బిడ్డకుఁ

గలుగఁజేయుచున్నది. అల్లరిచేయుపిల్లలను మనము పిల్లికూతలుకూసి భయ పెట్టుటలేదా?

---

## ౧౩
# బిడ్డలు - కలలు

అనాగరికజాతులు మనయాత్మ స్థూలదేహమును వీడునపుడు అనుభవించెడి కష్టసుఖములే స్వప్నములని నుడువుచున్నవి. నాగరికులు కలగనువాఁడు తన భవిష్యత్తునుగాని తాను కలలోఁగాంచిన మరియొకని యదృష్టమునుగాని స్వప్నములోఁజూడ గలడని స్పష్టపరచుచున్నారు. కాని సైకోయనలిస్టులలో నొకఁడగు ఫ్రాయుఁడు గారు స్వప్నము లొక నిర్దిష్టార్థమును సూచించుచున్నవనియును, ఇట్టికల లెవ్వనియందంకురించునోవాని వ్యక్తిత్వమును నడతను బహిర్గతిమొనర్చుటయందు, అవి తోడ్పడుననియును నుడివిరి. అందువలన శిశుస్వప్నముల తెలిసికొనినచో వానిభావముల పెద్దవారమగు మనము తెలిసికొని యట్టివారిని సన్మార్గమున పట్టింపవచ్చును.

వయోప్రాదుర్భావసమయమున బిడ్డలు గనుపరచు వింతచేష్టలు:—ఉలిపితనము మొదలగు లోపములు చిన్నతనమున తగినంత క్రమశిక్షణములేనందున బిడ్డల నావరించును. చెట్టైవంగనిది మానైవంగునా? అట్టి లోటుపాట్లు బిడ్డల కబ్బకుండ చేయుటకు తల్లితండ్రులు యథాశక్తి పాటుపడుట యుచితమే. బిడ్డనియట్టి దుష్ప

థంబునబెట్టు విషయములెవ్వియో వాని స్వప్నవృత్తాంతమును తెలిసికొనినచో మనము గుర్తెఱుంగగలము. కాని వారినుండి యట్టిప్రవృత్తిని రాబట్టుటకు మనము నల్లమేకను తేవలసినదే. సాధారణముగా పిల్లలు మనము గేలిచేయుదుమనిగాని ఏమయిన ననుకొందుమనికాని వారి స్వప్నవృత్తాంతముల మనకు చెప్పుటకు వెనుకాడుదురు. అదియునుగాక కొందఱు బిడ్డలు వారికి స్వప్నలోకము నందు గలిగిన యనుభవముల మనకు విప్పిచెప్పలేరు.

అయినను వారి ముఖలక్షణములఁబట్టియే మనము వారి కెట్టి స్వప్నములువచ్చెనో కొంతవఱకు తెలిసికొననోపుదుము. బిడ్డలు స్వప్నానుభవములకును లోకానుభవములకునుగల భేదమును గుర్తింపఁజాలరు. కనుక యుదయమున లేవగనే గతరాత్రి దుస్వప్నములువచ్చిన బిక్కమొగముపెట్టి యేడ్చుటయేగాక దినమంతయు తేటగా ఉండదు. కాని యుత్సాహజనకములగు స్వప్నములను గాంచినచో వారలు త్తేజము గలిగియుందురు.

బిడ్డలు ౧౨ సంవత్సరముల లోపలను ౧౩ వ యేడు దాటిన తర్వాతను సర్వసాధారణముగా కలలు గనుచునే యుందురుగాని పదమూడవయేట స్వప్నములు వారి కంతగారావు. పదిసంవత్సరములకు లోపల బిడ్డలకు చలనహేతు స్వప్నములు (Kinesthetic) అంతగారావు. కాని ౧౦ మొదలు ౧౭ సంవత్సరములవఱకు నిట్టి స్వప్నములమితముగా వచ్చును. పుష్టుగా తిను బిడ్డల కివి యెక్కువగా వచ్చును. సామాన్యకుటుంబములకు జెందినవారికి నివి యరుదుగా వచ్చును. ౫.మొదలు ౭ సంవత్సరముల

వఱకును బుడుతలు తమ గృహవిషయములకు సంబంధించిన కలలు గందురు.

అయిదుసంవత్సరముల బుడుత స్వప్నలోకమున తానే ప్రధానస్థానము నలంకరించును. ఈ యీడుబిడ్డలు సంబంధబాంధవ్యముల నంతగా గుర్తింపఁజాలరు. కాని ౭ సంవత్సరములు రాగానే చుట్టముల సహితము కలల యందు గుర్తింపగలరు. ధనవంతుల శిశువులకంటె ధనహీనుల బుడుతలే యాటవస్తువులను గూర్చిన కలలుగందురు. సాహసము ధైర్యమునకు సంబంధించిన కలలీ యీడువారల కంతగారావు. కొన్ని వేళలయందిట్టి బుడుతలు తమపాఠశాలనుగూర్చి ౮ మొదలు ౧౪ వత్సరములవఱకును కలలుగందురు. పసిబుడుతలు తిర్యగాదులకు సంబంధించిన స్వప్నముల గాంతురు. మగబిడ్డలు సాహసకృత్యము లొనర్చినటుల తరుచు కలలు గాంతురు. వారు దొంగలు, దోపిడిగాండ్రు మొదలయినవారిని నిద్రయందు గాంచి యెక్కువగా క్షోభమును జెందుదురు. కాని యాడుబిడ్డలు వింతగొలుపు పురుషులను వింతగొలుపు స్త్రీలను స్వప్నమునందుగాంచి కలఁత జెందుదురు. ముసలమ్మలు, జంతువులు సాధారణముగా బాలికలను స్వప్నములందు బాధ పెట్టెదరు. పది సంవత్సరముల వయస్సు పైబడగానే బుడుతలు కలవరింతలు మొదలు పెట్టెదరు. అందును బాలికలే యెక్కువగా కలవరింతురు. శృంగారాదివిషయముల గూర్చిన స్వప్నముల బాలికలే యెక్కువగా గాంతురట. కాని ౧౩ వ యేడు రాగానే వీరికి నసూయాప్రధానములగు స్వప్నములు వచ్చును.

పదునాల్గు వర్షములు రాగానే బాలురకు క్షోభ హేతువులగు స్వప్నములు రావు గాని బాలికలమాత్ర మివి వీడుటలేదు. ఈ యీడునకు వారికి పాఠశాలకు సంబంధించిన స్వప్నములు మెండుగావచ్చును. మగపిల్ల లు తాము మరణించినటుల స్వప్నముల మిక్కుటముగా గందురు. వారికి యక్షులనుగూర్చిన స్వప్నములు రావు. శిశువులు స్వప్నములందు తమ్మే తాముజూతురు; కాని కొన్ని యేండ్లు పైబడినపిమ్మట తల్లిని తదితరబంధువులను తమ స్నేహితులను క్రమక్రమముగా గాంతురు. ౧౦ మొదలు ౧౬ యేండ్లు వచ్చువఱకు నిట్టి స్వప్నములు వారి కెక్కువగా వచ్చును. బాలురు సాధారణముగా బాలికలనే స్వప్నములందు జూతురు. బాలికలు నట్లే బాలుర దర్శింతురు. భయహేతువులగు స్వప్నము లీయీడున బాలబాలికలకు సమానమే.

కల లెట్లు వచ్చును :—ప్రథమముననే దేనియొక యింద్రియప్రేరణ నూతనముగా మనకుఁ కలిగిన యనుభవముల స్మృతిపథమునకుఁ దెచ్చును. ఈ స్మృతి మన యందంతర్గతము కోర్కెలతో మిళితముజెందును. ఇట్టి కోర్కెలకుగాని, కోర్కెకుగాని సంబంధించిన నిజస్థితి మారిపోవుటయేగాక మన స్మృతికూడ కొంతవఱకు తారుమారు జెంది యట్టి మన కోర్కెల సులభముగా వ్యక్తపరచునటుల సాహాయ్యముపడును. సాధారణముగా ఇది పెద్దవారు స్వప్నములగాంచు పద్ధతి. బుడుతలుకూడ ఈ పద్ధతి ననుసరించియే స్వప్నముల గాంతురుగాని వారి స్వప్నములు సామాన్య స్వభావము గలవి. అవి సాధార

ణేచ్ఛలనే యావిష్కరించును. పెద్దవారి స్వప్నముల వారి పరిస్థితుల నన్నిటిని మనము తెలిసికొనుట కవకాశ మెక్కువగా ఉన్నది గనుక, సులభముగా విప్పి చెప్ప వచ్చును. మొరటువారియు, బుడుతలయొక్కయు స్వప్న ములు సాంకేతికములు గాక వారిని జేచ్ఛనే బయ ల్పరచును.

శిశు స్వప్నముల నవగతము చేసికొనుటెట్లో యిం చుక విచారింతము. ప్రథమమున వారి స్వప్నములయం దావిష్కృతమగు విషయముల వారి వ్యక్తిత్వము నడత స్థితిగతులతో పోల్చి చూచుకొనవలయును. ఇట్టుల లెక్కకు మీరువారి స్థితిగతులను వారి స్వప్నవిషయము లను అవగతము చేసికొని అంతర్గతాంశములగూడ శ్రద్ధ తో విచారించి తెలిసికొనిన పిమ్మట యట్టి స్వప్నముల విప్పి చెప్పవలెను.

శిశుస్వప్నములు వారి స్వభావమును తెలిసికొనుట యందు మన కెంతో తోడ్పడుచున్నవి గాన మన మిట్టి విషయము లవగతము చేసికొని కష్టసుఖముల నిష్పక్షపాత బుద్ధితో విచారించి వారిని సన్మార్గమును పట్టింపపవలయును.

---

## ౧౪

## బిడ్డలు-కథలు

పిల్లలు కథలనినచో చెవులుకోసికొందురు. "మా మ్మా! కథచెప్పవే, ఏమండీ! పంతులుగారు కథచెప్ప

రూ" అని యొకటే పీడించెదరు. కొందఱు ముసలమ్మలు చెప్పెడికథలు వినిన పిల్లలు చెడిపోదురు. వారు చాదస్తం అంతా నూతి పోయుదురుగదాయని యథార్థము తెలియక భంగపడుచుంటిరి. దానికి సంబంధించిన నిజానిజములు పరిశీలించినచో బాగుండునని యిది మొదలుపెట్టితిని. తల్లులు, ఉపాధ్యాయులు, ఇంకా పిల్లలవిషయముత్సాహము చూపెడివారును చదివి యీ యుద్దేశ్యము లెంతవఱ కనుష్ఠానయోగ్యములో తెలియుదురని నమ్ముచున్నాఁడను.

### కథ—దానివిలువ

శైశవారంభమున కథ బిడ్డనికి అపారమగు బోధ గావించుననుట నిర్వివాదాంశము. అది కథలు వినినకొలఁదియు మనోవికాసము నందుచుండును. కాని కథకుఁడు తెలివిగలిగి యితరబిడ్డల యనుభవములు, వారు గడిపెడి జీవనము, వారి యభిప్రాయములు ఆదర్శములు చక్కఁగా విశదీకరించినచో బిడ్డ డట్టివాని నేర్పరితనమున కెంతయో వెఱగుఁజెందును. వెంటనే వానితో సఖ్యమేర్పరచుకొనును. ప్రపంచమునందు వివిధములగు వింతలనుఁగూర్చి ప్రసంగించుటయు మంచిది. కథలు బిడ్డనిపదజాలమును పెంపొందఁజేయును; వానికి భాష నెట్లుల నుపయోగించవలెనో నేర్పును. భావలోకమును వృద్ధిచేయును. వాని యవధానశక్తికిని ధారణాశక్తికిని మెఱుంగుపెట్టును. ఈ పై విషయములను మనస్సునందుంచుకొని వివేకము, మాధ్యము నెంతతారతమ్యము గలిగియున్నదో శిశువునకు

స్పష్టపరుపుము. జీవితాదర్శములయర్థము బిడ్డనికి బోధ పరచ యత్నింపుము. వానికి ఆవేశము ధైర్యము నమ్మ కము కనికరముగలిగెడి కథలుచెప్పుము.

ఎట్టికథలు చెప్పవలెను ?

ఈ దినములలో కుక్కగొడుగులవలె ఒకటే జన్మిం చుచున్నవి గ్రంథములు. "అజాగళ స్తన సగోత్రులకు" —ఈ పదప్రయోగమునకు క్షమించుడు— అట్టివాని యోగ్య తాయోగ్యతలు గుర్తించి శిశువున కమిత యుపయోగ కరములగు కథలనే చెప్పుచుండవలెను. ఏదో పైభారము తొలఁగించుకొనుటకే నోటికివచ్చిన కథచెప్పుట సరికాదు. అట్టి కథలను మనజీవిత కాలమంతయును వినియోగపరచి నను గ్రోడీకరింపఁగలమా యనెడి సందేహము పొడమ వచ్చు. అట్టి సంకోచములను వీడి సదాకార్యరంగమునకు దిగుటమేలు. అయితే యే కథలను చెవియొగ్గి వినెదరు బుడుతలని యడిగెదరేమో వానిని చెప్పుచుంటిని వినుఁడు.

కథ కల్పితమైనదని శ్రోతలకు తట్టకూడదు. ఒకప్పు డది నిజముగా జరిగిన కథ కాకుండినను, చరిత్రాత్మకము కాకుండినను ప్రపంచమున సాధారణముగా జరుగుచుండిన విషయజాలమును గ్రుచ్చియెత్తెడిదై యుండుట మంచిది. పాపము, అసత్యము, అధర్మము జయమును గాంచునని ప్రతిపాదించెడిదిగా కథ యుండుట శుభావహముకాదు. యక్షకథలు షోదలైనవి బిడ్డలెక్కువగా వినుటకు మక్కు వపడెదరు. "సత్యమేవ జయతి" "సత్యంవద ధర్మంచర"

యనెడి కథలు బాగుండును. శోభకరమైనట్టి కథలకై చదువునేర్చిన బాలురు ముందంజవేయుదురు. కాని విసుగు పుట్టించెడివియు, భీతికరములైనట్టివియు, రోగకరములైనట్టియు వంచకత్వము నుపపాదించునట్టివియు కథలను చెప్పఁగూడదు.

బాలురయం దభిరుచియు నిత్యనూతనోత్సాహమునుగలిగించు సామర్థ్యము కథకుండవలెను. అభినయపూరితమై, నటనాకౌశలముగలదై హాస్యరస భూయిష్టమై, అంత్యప్రాసాదినియమముగలదై యుండవలెను.

కథచెప్పెడి విధానము

కథ చెప్పుతరి మైమరచి యావేశపూరితుఁడవై నట్లుండవలెను. నీకును, బిడ్డలకును కొట్టినపిండియై యున్నకథనే చెప్పుము. నీ చిఱుతప్రాయమున నీవు విని ముచ్చటపడిన కథలను జ్ఞప్తికి తెచ్చుకొనుట శ్రేయస్కరము. బిడ్డ లెట్టికథలు కావలెనందురో అట్టివానినే చెప్పుట యుచితము. బిడ్డల యెట్టయెదుట నీ కథలయందలి పాత్రలు "తోలుబొమ్మల"వలె తాండవమాడునటులఁ జేయవలెను. నీ పదజాలము విశేషణములతో నిండిపోవలెను. విద్యనేర్చుకొను బిడ్డలు మూడు విధములని చెప్పవచ్చును. శ్రోత్రేంద్రియ మెక్కువగా పనిచేయువారు (Audiles) స్పర్శేంద్రియ మెక్కువ చురుకుగా నున్నవారు (Tactlies) చక్షురింద్రియముద్వారా విషయ సంగ్రహణము జేయువారును (The visuals) అందు

లకై యిట్టి మూడింద్రియములకు గ్రహణయోగ్యము లగు చిత్రములతో నొప్పారెడి కథలు చెప్పుచుండవలెను. మీ కథ కొండవీటిచేంతవంటిది కాగూడదు. ఎంత కుదించిన నంతమంచిది. సాధారణమగు నభినయమును కథకుఁడు చేసినను తప్పులేదు. బిడ్డలు దానిని బాగుగా నానందించినచో "మళ్లా" యందురు గాన మొదటి పర్యాయమే యందలి విషయానుక్రమణిక బాగుగా గుర్తుంచుకొనవలెను.

ఈ కథ నీతి యిదియని నీవు చెప్పనుగూడదు. బిడ్డచేత చెప్పించ యత్నించనుగూడదు. ఈ లక్షణములుఁ గల కథకుఁడు శ్రోతయందు కథకూడ నొక శాస్త్ర మనెడి యాశ్చర్యమును పుట్టింపగలుగును,

కథ చెప్పవలసిన సమయములు

కథ బాగుగా చెప్పవలయుననినచో సమయా సమయముల పర్యాలోచనచేసి చెప్పుచుండవలెను. పరిసర ములు నిశ్శబ్దముగ యున్నతరి యాపనికిఁ బూనుకొనిన బాగుండును. పునరుక్తి అంత్యప్రాసాది నియమములు గల కథలనే చెప్పవలయును. బిడ్డ క్షుత్తుతో బాధపడు చున్నను ఇతర కార్యాసక్తుఁడైనపుడును కథచెప్ప నుంకింపఁగూడదు. అట్టియెడ వానియవధానమును మళ్ళిం చుట కష్టతరముగదా ! నిద్రపోవుటకుముందు బిడ్డల కెల్లప్పుడును శాంతియుక్తములు అనగా నాకులపాటు గలిగింపని కథలనే చెప్పవలెను. అటులఁగానిచో మనః క్షోభముజెంది బిడ్డ నిదురపట్టక చిక్కములో పిట్టవలె

కొట్టుకొనును. ఒకవేళ నిద్రగాంచినను దుస్వప్నములఁ గనును.

కథకుఁడు గమనింపవలసిన కొన్ని నియమములు:—కథ యెటుల చెప్పవలయునని ప్రశ్నించుట సులభమేగాని దానికి ప్రత్యుత్తర మొసంగునప్పటి కేరికైనను తలప్రాణము తోకకువచ్చును. ఇదియు నొక కళయే. తద్వారా కథకుఁడు మహత్తరమైన వర్తమానము నొసంగుచున్నాడు. కథకుఁడు తాఁజెప్పు కథయందలి కష్టసుఖములు తా ననుభవించి యుండినచో కథకు బలమెక్కువయగును. అట్టి యనుభవములు సమయము వచ్చినపుడు వానిమోమున సువ్యక్తములు గావలెను. అటుల నుద్రిక్తుఁడుగాని యెవ్వఁడు నీపనికిఁ బూనఁగూడదు. అట్టి యనుభవ మనుభవైకవేద్యమేగాని కావలెనని పెనఁగులాడిన నబ్బదు. అందువలన కథకుఁడు గుణగ్రహణపారీణుఁడై యుండవలెనని స్పష్టమగుచున్నది.

కథకుఁడు స్వకార్యాచరణమునం దప్రమత్తుఁడై సదా ప్రవర్తింపవలెను. నాలుక తడఁబడఁగూడదు. కథలోవచ్చెడి పాత్రలు పట్టణములు మొదలగువాని నామము లుచ్చరించుతరి పొరపడఁ గూడదు. కథాంశములను వదలివైచి వానిని తిరిగి అతుకుపెట్ట చూడరాదు. కథను బాగుగా నవగాహనము చేసికొననందున డొంకతిరుగుడువాక్యములు కొందఱు ప్రయోగింతురు, అట్టి యభ్యాసమును మానవలెను. కథకుఁడు సాధ్యమైనంతవఱకు స్వభాషనే యుపయోగింపవలెను. బిడ్డ

లద్దానిని విని స్వర్ధునీనాదములచేతనువలె శ్రోత్రపర్వ మొనరించుకొందురు.

పాఠశాలలయందుపాధ్యాయులు కథచెప్ప నిచ్ఛగించినచో నర్ధచంద్రాకారముగా బుడుతలను కూర్చొనపెట్టవలెను. ఒకరివెనుక నొకరిని కూర్చొననీయరాదు. ఉపాధ్యాయు డందఱికి నెదురుగా దగ్గరగా కూర్చొనవలెను. కాని వారు ధ్వనిచేయ మొదలుపెట్టినచో నీవు కథను వారల కాహ్లాదకరమగునటుల చెప్పుట లేదని యర్థము. కనుక నీలోపమెద్దియో కనుగొని యద్దాని సవరించుకొనుము. ఆరంభమునందే పిల్లలను వశముచేసికొనునట్లు ప్రవర్తింపుము. మొదటివాక్యము నుడువగనే బుడుతలందరు నిమ్మనీరెత్తినట్లుండవలెను. ఉపరి నీవమితోత్సాహము గనుపరచవలెను. నీవాగమృతపు సహజధారయే వారి యుత్సాహమునకును దోహదమగును. కథయందు లీనమైనచో సర్వమును సులభమగును. చిచింద్రీ, మతాబులవంటివియు పిల్లలకు తెలిసినట్టివియు నగు పదములనే ప్రయోగింపుము. కథయందలి విషయజాలమెప్పుడును క్రమముతప్పకూడదు. నీవు విసుగు కనపరచునెడల బిడ్డలుకూడ విసుగుజెంది వారి యుత్సాహమును గోల్పోయెదరు.

కథకుని వాగ్ధోరణి యెటులుండవలెనో యించుక విచారణసల్పుదము. గొంతుచించుకొనుట పనికిరాదు. స్వాభావికముగా నీ వెటులమాట్లాడెదవో యటులనే మాట్లాడుము. నీ కంఠధ్వని స్పష్టమై యనర్గళమై సరళమైయుండవలెను. ముక్కుతో మాటలాడకుము. బిగ

పట్టి మాటలాడకూడదు.

బిడ్డలవయస్సు - కథలు

బిడ్డలవయస్సు ననుసరించి కథల యంతస్తుగూడ మారుచుండును. ఏ యేవయస్సువార లే యేకథలు విన కుతూహలముచూపుదురో విచారించుటమంచిది. ఇట్టి విచారణసలుపుటకుముందు వివిధవయస్కులగు బిడ్డలనువారల కే యేకథలిష్టములో తెలిసికొనియుంటినని పాఠకులకు విన్నవించుచుంటిని. అట్టివిచారణ నాధారము చేసికొనియే కొంతవఱకు ప్రస్తావించుట కిచ్ఛగించుచుండుట.

పురాణకథలు సాధారణముగా ప్రాచీనులమతము. వారి మూఢభక్తి భయము మొదలగువిషయముల ప్రతిపాదించును. తన పరిసరములను బాగుగా నవగతము చేసికొననిబిడ్డడు నట్టి కథలు వినుట కుబ్బితబ్బిబ్బగును. ఈనాటి నిరక్షరకుక్షులు నట్టికథలన్న పడిచత్తురు. రామాయణమనిన యొకయెద్దుబరువనిన గొల్లనివిషయము మీార లెఱింగియేయుందురుగదా! కథలయందావిష్కృతములగు నాదర్శములే వానిని వినుటవలన భ్రమరకీటన్యాయమొప్ప బిడ్డల యాదర్శములుగూడనగును. కనుక కథలనెంతయో యుక్తాయుక్తజ్ఞానముగలిగి యేర్చికూర్చి చెప్పుటమంచిది. ఈకథలవలననే బిడ్డల నడవడికగూడ చాలవఱకు చక్కఁబడుననుట యతిశయోక్తి గానేరదు.

బిడ్డలు మూడు సంవత్సరములు మొదలుకొని

ఆఱు సంవత్సరములవఱకు తనకు పరిచితములగు విష యములనుగూర్చిన కథలనే విన నాశించును. ఆతఁ డింకనూ భావనాప్రపంచమెట్టిదియో యెఱుఁగడుగదా ! ఉన్నది యున్నట్లే వానికి కనుపడునుగాని యందలి యంత రార్థ మతఁ డరయఁజాలడు. తండ్రి, గుఱ్ఱములు, కుక్కలు, పిల్లులు, ఎలుకలు, తోటిబిడ్డలు మొదలగు వానిని గూర్చిన కథలన్న వానికెంతయోమక్కువ. అట్టి శిశువు పిల్లికూతలు, కుక్కఅరుపులు, శివారుతములు నన్న చిందులువేయును. ఆవయస్సువారికి చెప్పుకథలయం దట్టికూతలు కలుపుటమేలు. కథ మిగుల చిన్నదిగా ఉండవలెను. బుడిబుడినుడులతోడనే చెప్పవలెను. ఉపరి అంత్యప్రాసాదినియమములు మిక్కుటముగా నుండ వలెను. అనగా "కత్తిపోయి ఢోలువచ్చె ఢాం ఢాం" వంటి వాక్యములతో కథ నిండియుండుట మంచిది.

ఆఱుసంవత్సరములు దాటిన పిల్లవానికి నూతన భావము లుదయించును. అపుడు వాడు నిజమైన కథలనే గాక భావపరంపరలను వృద్ధిపొందించెడి కథలను వినుట కిష్టపడును. మైదానములు, యెడారులు, అటవీప్రదేశము లందుజరిగిన సంగతులను వినగోరును. పెద్దపులి సింహము మొదలగువానినిగురించిన కథలు వానివయస్సునకు తగి యుండును. అట్టికథ లాంధ్రభాషలో లేకపోలేదు. "అడ విలో అక్కమ్మ మనుమడా, పులిమహారాజు కొడుకా" యను కథలవంటివి చెప్పుట యుత్తమము. ప్రాచీనులు ప్రకృతికిజంకి వనదేవతలను, జలదేవతలను, దయ్యములను బ్రహ్మరాక్షసులను నిర్మించిరి. అవి తప్పక మానవనిర్మిత

ములే గాని తమంతటతాము జనింపలేదు. ఆలంకారిక ముగా కవులును వానిని వర్ణించియుండిరి. మనవారు వానితోఁగూడిన కథలనుగూడ చెప్పుకొనిరి. అట్టికథ లిప్పటివారును చెప్పుచునేయుండిరి. అట్టికథలు ఆఱు మొదలు యెనిమిదిసంవత్సరముల వయస్సుగల బాలునికి రుచించును. ఇవికాక సాహసికులగు బాలకులనుగురించిన కథలన్నను వారికిష్టమే. అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు, మేనత్తలు మేనమామలు, కథలలోవచ్చినచో వారికి సంతోషముకలుగును. ఈయీడుబిడ్డలు పైచుట్టములను గుర్తించుచునేయుండిరిగదా! తల్లి, తాతయ్య కథచెప్పి నచో బిడ్డలు "అమ్మా మనతాత యెప్పుడువస్తా" డని యడుగుటయు నందువలననే.

ఎనిమిదిమొదలు పండ్రెండుసంవత్సరములవఱకును బాలురు వీరరసభూయిష్టములగు కథలను విన నిచ్ఛగింతురు. ద్రోణుఁడు, అశ్వత్థామ, కర్ణుఁడు, భీముఁడు చేసిన చర్యలను వర్ణింపుడని పంతుళ్ళ ప్రాణాలుతీయుదురు. రాజపుత్రుల కథలనినను వారికిష్టమే. యుద్ధమనినచో లొట్టలువేయుదురు. వికర్ణుడర్జునునితో నెటుల సమరకర్మ మొనరించెనో తెలియగోరుదురు. అభిమన్యుని వీరకర్మముల మాటిమాటికి చెవులనొప్పగించి విందురు. అందుల కేగదా అట్టివా రనుదినము "గిల్లికజ్జములు" తెచ్చుట.

కాని పదమూడవసంవత్సరము పైఁబడగనే అబ్బాయికి మోటుతనముపోయి "నాజూకు" అబ్బును. తనశరీరమును మంచియుడుపులతో నలంకరించుకొన వలయు ననెడికోర్కెలు జనించును. మంచిమంచిబట్టలు ధరించు

కొనిన పాత్రలు, కథలోవచ్చిన వారిని మెచ్చుకొనును. అటులనే, నేనును వస్త్రములు ధరించవలయునని కోరిక నిశ్చయుఁడగును. అందులకే మనవారు "చిన్నవానికి గుడ్డచూచినను ముసలివానికి పెండ్లాన్నిచూచినను మురిపె మెక్కువ" యనిరి. బాలికలు కథలోవచ్చిన "భేష్, భేష్" యని లోలోననే మెచ్చుకొందురు. బాలికలను గూర్చిన కథలను విన నిచ్చగింతురు. "అమ్మా, సినిమా" అనెదరు.

పై విషయములనుబట్టి వారివారి యీడునకుతగిన కథలనే చెప్పవలయుననియు, భాష[illegible]ు వారివారికి తగినదే ప్రయోగింపవలయుననియును, ఏచెత్తనైనను వారిని చదువనీయఁగూడదనియు మనము నేర్చుకొంటిమి. ఇతః ప్రభృతి తల్లులుగాని తండ్రులుగాని యుపాధ్యాయులుగాని కథలుచెప్పునపు డీ నియమముల పాటింతురని నమ్ముచు చున్నాను.

ఆంధ్రభూమి ముద్రణాలయము — వేపేరి, మదరాసు.

# 7 రూపాయలకు

## కథలు-కావ్యములు-కళలు

## నవలలు-నాటకములు

విజ్ఞానవిషయములు - నానాదేశచరిత్రలు - వింతలు విశేషములు - గుఱించిన పుస్తకములు నెల ౧ కి రెండు గాని, రెండు నెలలకునాలుగుగాని ప్రకటింపబడును.

## అన్నిగ్రంథములు ఆధునికములే

నమ్మాళ్వార్స  పోస్టుబాక్సు ౨౫౧  మద్రాసు

# పుస్తకములు 24

